# ఆంధ్రదేశకథలు.

(ఆంధ్రరాష్ట్రమునుండి)

ప్రకాశకులు

శ్రీ వత్సవాయి రాయజగపతివర్మగారు.

కోటలుమార్గము శ్రీకృష్ణాముద్రాక్షరశాలయందు
ముద్రింపించి ప్రకటింపబడెను.

పెద్దాపురం.

# ఆంధ్రదేశకథలు.

(ఆంగ్లభాషమునుండి)

ప్రకాశకులు

శ్రీవత్సవాయి రాయజగపతివర్మగారు.

చామర్లకోట.

శ్రీసరస్వతీ ఆర్టు ప్రింటింగు వర్క్సునందు శ్రీవర్మగారిచే ముద్రింపబడి

ప్రకటింపబడినది.

సర్వస్వామ్య సంకలితము. 1930 వెల 0-8-0



# అదృష్టము.

(సుధానిధి.)

రైలురోడ్డుప్రక్కనే రత్నగిరియను గ్రామ మొందుగలదు. దానికి చుట్టుపట్ల రెండుమైళ్ళలోపున స్టేషను లేకపోవుటచే, నేబండియు నాగ్రామప్రాంతముల వడిగనేపరుగెత్తుకొని పోవుచుండును. ఈరత్నగిరి మంచి చక్కనిగ్రామము ధనికులంతగా లేరుకాని యున్న గృహస్థులందరుకు మంచి భూవసతి యుండి యింటియన్నోదకములకు లోటులేదని చెప్పవచ్చును. గ్రామమునంటియే రైలుకట్టకవతలిప్రక్కన గవర్నమెంటు రిజర్వ్అడవియు నదిమొదలు చాలాదూరమువఱకు తూర్పునను మలపర్వతపంక్తులనుండి యుండుటచే రత్నగిరియు నొక్కయెత్తయిన పీఠభూమిపై నిర్మింపబడిన చిన్నగ్రామముగా జూచినవారు గ్రహింపకమానరు. గ్రామమునంటి బ్రహ్మాండమంత చెఱువున్నది. దానియందు వేసవిలోసహితము నీరెండిపోవుట యెఱుంగరు. అదియే పానీయమై గ్రామస్థులకేగాక రాత్రి సమయములందు నాయరణ్యక మృగతండములకుకూడనుపయోగపడుచున్నవి. ఈయూరిలో నాలుగుకొంపలు బ్రాహ్మణు

యుంటఅచ్చయ్యమ్మ అనేపిల్ల యొక్కతెయున్నది. ఈమెకు నవ
ము ముప్పదియవసంవత్సరము! తండ్రి చిక్కిపోవుటచే నీమె న
వయూ పెండ్లి కడుగరాలేదు వెలమవారిలో పిల్లవంకవారువరు
స్కై వెదుకుటబుద్ధికొట్టివేసినంత యవమానమట! అందుచేత
చేయునది లేక మీనమేషముల కెదురుచూచుచునూరకొన్నా
రు! తగని ఘోషాగూడా నుండుటచే వగవుహగునకైనా యుం
డు జోరబడి అచ్చయ్యమ్మ దీనచరిత్ర దెలిసికొననసినపడదు;
కాని అచ్చయ్యమ్మకు లింగమ్మ రంగమ్మ యిర్వురు చెలికత్తెలై
నారు. స్నేహము మిక్కుటమైనది రంగమ్మ సహవాసమున
నచ్చయ్యమ్మకూడ మంచివిదుషీమణిగా గల్గినది. వీరుముగ్వురు
తుదకు రోజుకు నాలుగుగంటలైనాయొకచోగూడి ఇష్టాగో
ష్టి చదువుకొనుచుండెడివారు. నవలలు, నాటకములు, మాస
పత్రికలు, పాత్రికవేకానిందు కలబోసి యూపిరిసెరపకుండ రం
గమ్మయన్న రామారావు చెల్లెలికై పంపుచుండెడివాడు! అవి
యన్నీ అచ్చయ్యమ్మ హావేలీలో జేరెవి. వీరుముగ్వురు చదివి
యానందించుచుండేవారు, ఒకరోజున వీరుముగ్వురుకలసిచేసిన
యీక్రిందిప్రసంగమువలన వీరిహావభావములు ప్రదర్శింపబడ
గలవు.

అచ్చ — వదినా; రంగమ్మా ఇదేం ప్రారబ్ధమమ్మా మీ
లో వితంతువులై మనలింగమ్మలాంటిపిల్లలు గోలపెడుతుంటే

నాబోటినిర్భాగ్యులకసలే పెండ్లియోగ్యమేలేకుండ యేడ్వవలసి వస్తుంది.

రంగ—ఔనండీ వదినా; మన దేశం కులాలక్రింద విడిపోవడం, అందులో తగని అభిజాత్యాలు పెరిగిపోవటం, ఎక్కడికక్కడకే పిల్లలుదొరక్క త్రొక్కిసలాడటం అయిపోతుంది; దీనికెప్పుడు విరగడియౌతుందో తెలియదుకాని; చక్కగా ఆ దొరల్లు దొరసానులు చూడండీ యిష్టమౌతే పెండ్లిఆడతారు. లేకపోతే మానేస్తారు హాయిగా పదిమందిలోనూ తిరుగుతారు మానంగా వాడుకొంటారు. మనబ్రతుకు ఎటు చూచినా అగాధమైపోయుందండి వదినగారూ?

లింగ—రంగమ్మొదినా; కట్నాలవల్ల [illegible]లవల్ల వాళ్ళ పిండాకూళ్ళవల్ల అమ్మకాలవల్ల ఆఖర్కు బుర్రగొరిగింపులవల్ల యేం పాపమొచ్చిందమ్మా మనవాండ్లకూ! ఇదెక్కడిపోగాలమన్నా ముసలితొత్తులు బోసిరాణులు మహాస్వారీల్లాగ బయల్దేరి ఆడపిల్లలను వలేసిపీకనులిమేసి నోట్లెక్కొంటున్నారు వాళ్ళ యిల్లు ల్లవకాడుగాను. అప్పటికీనేయుంది లెండి [illegible]గదేమిటి మొరగని పసికూనల్ని విధవలనుజేసి వంటింట్లో పాతేస్తారుగదా,

అచ్చ—రంగమ్మొదినా మాకంటె నీకు [illegible] గా [illegible]ంచకము. భోగట్టా తెలుసును! పల్లీ పీటికే[illegible] అంతుబొంతా యేమిటి;

రంగ—ఇంకేమమ్మా ఎందరో పెద్దలు యోచించి కష్టించి సంఘసంస్కరణములని బయలుదేరదీశారు;

అచ్చ—ఏంజేస్తున్నారేమిటి;

రంగ వర్ణాశ్రమాలలో అధమము ఈలోతబ్బీలు శాఖలైనా తీసివేయుండని గోలెడుతున్నారు. వరకన్యాశుల్కాలు వల్లకాదంటున్నారు. పెండ్లాడాలనియున్న వితంతువులను జేర్చి పెళ్ళిళ్ళు చేస్తున్నారు, ఆచేయడంలో నూ అంతగావన్న భేద మూహించ కుండానే యవ్వౌన్యము కుదిరిందంటే సంధానం చేస్తూన్నారు, ఇంకాయేమిచేస్తారు చేసికొనేవాళ్ళుకూడా బుద్ధితెచ్చుకొని వాళ్ళకు సహాయం చెయ్యాలికాని వాళ్ళేక్కడి కని యెగసందోస్తారు.

అచ్చ—అవుతే! వదినా పెళ్ళిళ్ళులేవి మ బ్రతుకేమిటి? యెలాగ మాకుదారి

రంగ—బహుశః మీరుకూడ శరణాలయంలో చేరితే పెండ్లిప్రయత్నాలు చేస్తారు. అంతకంటె యేమిచేయగలరు

లింగ—అక్కా! అచ్చయ్యమ్మా నేనింక పాపాట ముడిచెపుతాను. మనవదినకేమి హాయిగా మగడుగల ఇల్లాము. మనమిద్దరమే అటు ఇటూ చెడ్డవాళము. రా; మన మొక దూకు దూకేసి యూశరణాలయంలో బడదాము. అసలు ఎంతైతె మనగ్రిహచార మీలాగున్నంటే అలాగవుతుంది.

అచ్చ—అయ్యో! అయ్యో! లేచిపోయినారనరట మ్మాతల్లీ! మళ్ళీమనయింటికి రానిస్తారా?

రంగ—ఆమాటఉన్నది. ఒక్కసారి వెళ్ళినారంటే; యీ సంబంధాలన్నీ తెగగోసికొనియే పోవాలి! ఆతరువాత భగవంతునిదయ యెట్లావుంటే అట్లాఅగుతుంది ఇల్లువారుముప్వురనేకసార్లు పరిసంగించుకొన్నారు కాని ధైర్యముచాలలేదు. లింగమ్మకుపోదుమా యనియుబలాటమున్నదికాని యెట్లయినా చెలికత్తెవంటిదై తనకంటె ముసలిదై ముప్పదేండ్ల ముదికన్నె పడుచు అగు అచ్చయ్యమ్మనుకూడ వెంటాడించుకొందమని చాల పోత్సాహమొసర్చుచున్నది. రంగమ్మ దీనికుసాయము చెప్పకపోవుచున్నది.

వచ్చేసంక్రాంతికి చెల్లినితీసుకొనవెడదామని లింగమ్మయన్న రామారావు రత్నగిరివచ్చినాడు. వెంకటావధానలు మామగారిని తనభావమందిని వప్పించినాడు లింగమ్మకుదివటుకే లినభర్తసూచాయగా నన్నయిచ్చియుండుటచే వియాణ సన్నాహముమీదనేయున్నది. రామారావు బియ్యే చదువుచున్న తెలివైనవిద్యార్థియగుటచే హాయిదున్నే కాఫీ కావల. అచ్చయ్యమ్మనడిగి పాలుపట్టుకొనివచ్చి తనపెట్టిలోవున్న పౌరికాఫీ డబ్బానుండి కొంతపొడుముతో కాఫీయారుచేసి పెసరట్లువెచి యాతనికుదయమునకే విందారగింపజేయుచు రంగమ్మ పక్కనే

నిలచుకొన్నది. లింగమ్మయువచ్చి ,,ఏమండీ; బావగారు కాఫీ తాగుచున్నారా! అని పల్కరించి తలుపుచాటున నిలచుకొన్నది.

రంగ—అన్నా! మన లింగమ్మొదినకుకూడా మనయింటికొకసారి రమ్మనరాదటరా?

రామా—అయ్యో ఇంతకన్నాయుందా? యేమివదినా వస్తారా! మాతోటి? మేము పరాయివాళ్ళముకాము.

లింగ—అయ్యో! పరాయివాళ్ళేమిటి మనకుమనకూ యీనాటిసంబంధమా యేమిటి; కాని మానాన్న యేమంటాడో

రంగ—ఒదినా! నీవు వస్తానంటే నేనన్నీ యేర్పాటు చేయగలను: అని యామె అర్ధాంగీకారసూచకమగు నవ్వుతో బురికొల్పబడి అత్తతోటి మామగారితోటి అన్నిటికిమూలము తనభర్తతోటి మారాంపెట్టి లింగమ్మప్రయాణము స్థిరపఱచినది. పరుగుపరుగున అచ్చయ్యమ్మగారి యింట చెలికత్తెలు కలుసుకొన్నారు. సాభిప్రాయసూచకముగా ప్రయాణము గురించి తర్కించుకొన్నారు. అచ్చయ్యమ్మ కళ్ళతోటే లింగమ్మను కౌగలించుకొని హృదయమందే యాశీర్వదించినది. తనబిడ్డనుగురించి తనలో దాను తహతహలాడిపోయినది. రంగమ్మ అచ్చయ్యమ్మనుజూచి నిర్విణ్ణయైనది. ఆఖర్కు లింగమ్మ ప్రయాణ మొక్కటేస్థిర మైనది.

3

లింగమ్మ రంగమ్మతో గూడా రాజమండ్రి వెళ్ళిపోయి నది- అచ్చయ్యమ్మ బ్రతుకు జరుగుటలేదు. నిమిషమొక యుగమగుచున్నది. తనతల్లిదండ్రులింక తమ యాభిజాత్యము లువీడి తగినవరునికెవరికోయిచ్చి తన్నొక గట్టున బడవైతురన్న యాశ యెంతమా త్రము లేదు. తానేమిచేయుటకును నిశ్చయ ము గోచరింప లేదు. ఊహాప్రపంచము బెదిదమై పీడించుచున్నది. రంగమ్మ రాజమండ్రి నుండి వారమునాటికి తన భర్త ద్వారా యొకయుత్తరము అచ్చయ్యమ్మకందునట్లు పంపినది. అందు స్ప ష్టముగా మున్నే విదియాశుక్రవారంనాడే లింగమ్మకు రామా రావునకు పాణిగ్రహణోత్సవము జరిగినట్లును- ఈసంగతి తన భర్తకును చెలియునని యును వారి యనరామీాదనే యిట్లు సాహసించి చేయగల్గితిననియును సవిస్తరముగా వ్రాసియున్న ది- అచ్చయ్యమ్మ హృదయము పేలిపోవునోయనుసంతటి యాందోళనాయమానమై పోవుచున్నది.

ఆనాడు అమావాస్య గాఢాంధకారబంధురముగాగ రు చీకటి గ్రమ్ముకొనియున్నవి. రాత్రి రెండవ యామము దాటి న నిశ్శబ్దనిరంజన సమయమున అచ్చయ్యమ్మ యిల్లుదాటి వి ద్యుల్లతవలె మెఱయుచు గడగడ వడంకుచు చఱచఱ నడచి పోవుచున్నది. ఆమె హృదయాంతరాళమునగల భావనాశ్రం

చక మెంత బెడిదములై, భీకరములై యున్నవో యామెకు నా
భగవంతునకు మాత్రమే యెరుక; ముప్పదియేండ్ల నడివయ
స్సువరకు పెండ్లియోగము లేక యింకముందగు సూచనగానరా
క నిరంతర దివాంధమువలె- కాదుకాదు- కండ్లులేనికబోదివలె
యీనాల్గు గోడలమధ్య ఆమరణాంత కారాగార ప్రవేశమున
ర్పబడి నేడకస్మాత్తుగా నొక యావేశముచే వీథింబడి యానిశీ
థినీకాంతామతల్లికచాటున దిరుగునప్పుడు మనోందోళన మెంత
యుండు ననగలము? ఎంతనివర్ణింపగలము? ఆమెమనస్సులో ను
న్న దొక్కటియే యోచన. ముమ్మాటికి హీనమైన బ్రదుకు
సాగించుటకంటె ఏదో తటస్థించిన విధమున ప్రాణము త్యజించు
ట యొక్కటియే యామె కోరుచున్నది. ఏవిధముగ నామృత్యు
దేవత దన్నుస్వీకరించినను సరియే నప్పకొనియున్నది. కానితన
కొక స్థిరప్రణాళిక దొరకలేదు. దొరకకయే యిన్నాళ్ళు ఆలో
చించినది. ధర్మసందేహముపీడ నీవిధముగ వాయువేగమునగ్రి
హస్థితి మెటకునెట్టిన నటకుబోయిన నొకచోనైన మృత్యువె
దురు కారాదాయనియే, సాహసించి యీనాడు బయటబడి
యిట్లుపోవుచున్నది. ఎన్నడు నాదారులెఱింగినదికాదు. వివి
యుండలేదు. పొలములెక్కడో, పుట్టలెక్కడో. రాజబాటలేవో
యేమియు నామెకు తెలియదు. పోనుబోను మహారణ్యమధ్య
మున కేతెంచినది. అగాఢాంధకారబంధుర కాంతారమధ్యమున

నొకపొదరింట మేకపిల్ల కారుకారున నార్చుట చెవింబడి యట
కరుదెంచినది. ఆపొదరింట తనబోటి దీనజీవి యొకర్తుకయున్న
దని లోనబ్రవేశించినది. లోననడుగు వేయుటతోడనే యగాధ
మైన ధ్వనితో డనవెనుకనే పైనన్న తలుపుమూతబడిపోయి
నది స్వయముగ నెఱుంగక పోయినను పులికై యొగ్గిన మాట
ని యాశ్చర్యానంతరము గ్రహించినది. నలుమూలలుదడివి
యామె యిదివిశాలమైన బోనని యు నయ్యది యెవ్వరిచేతనో
యిల్లు యొగ్గబడి యున్నదనియు గ్రహించి భగవదత్తమైన
యూచిత్ర పరిస్థితికి తనలోదా నాశ్చర్యపడుచు నేమిజరిగినను
సరియే! మృత్యువే శరణ్యమగుగాక యన్న దానికిక భయమే
లయని యామేకపిల్లను గాగలించుకొని కూర్చున్నది. మేకపిల్ల
యు మసిపియలికిడిపిని భయముడుపుకొని ఆర్పుమాని పడుకొ
న్నది. కొంతసేపటికొక కొండదొర మేకయార్పు లేకపోవుట
యు తలుపుపడినచప్పుడును రెండును సంగ్రహించుకొని పులిపట్టు
పడెనని కుతూహలముతో దూరముననున్న తనరహస్య స్థలము
నుండి యిటకరుదెంచెను. విద్యుద్దీప సహాయమున నందుగల
వ్యక్తిని జూచి నిర్భరాశ్చర్య మగ్నుడయ్యెను. దీపికాసహాయ
మున నామెను బరిశీలించి యెవరునీవు? అని ప్రశ్నించెను. ఆమె
మాట్లాడక తలవంచి ననుసిబ్బలీయో యన నూరకుండెను. ఆ
తడు మెల్లగ గీలెడలించి తలుపుతెఱచి యామెభయముదీపి

కాంతా! బోధపడినది, భగవంతుడు మరలనాకే నిన్నర్పింప సంకల్పించినాడు, మొదట మాతండ్రి మీతండ్రిని నిన్ను నాకిచ్చుటకు పెళ్ళిప్రశంస యొనర్చ మీతండ్రికి మాకులగౌరవములు చాలక త్రోసివుచ్చెను, నేను ఈనడికొండ యిజారాదారుడను భయమువలదు. రమ్మని సంజ్ఞ మొనర్చెను, అచ్చయ్యమ్మ యాసుందరాకారుని జూచి యిది దైవఘటనమనియో మనోలగ్నమైనదో కాని కిక్కురుమనకుండ నాతనివెంట చక్క వెళ్ళినది,

౪

వెంకటావధాన్లుగారికి లింగమ్మ పెండ్లి తెలిసి కుమారుని నవతలికి వెడల నడిచెను, రంగమ్మభర్త యాదినుండి యెరిగిన కుశాగ్రబుద్ధి యగుటచే రాజమండ్రివచ్చి చెల్లెలిని భార్యను బావను గలిసికొనెను, అచ్చయ్యమ్మ వెంగళ్రాయణిం గారను నాపులివేటకాని మరునాడే పెండ్లాడెను, తండ్రి వెంకట్రాయణింగారికి తుదకు వెదికింపగా సంగతియావత్తు తెలిసి యిదియొక స్వయంవరమని లోలోన సంతసించెను, గాని కొన్నాళ్ళ వఱకు అల్లుని కూతుని జూడలేక పోయినాడు! రాజమండ్రిలో లింగమ్మ నడిగొండలో అచ్చయ్యమ్మయు హాయిగా దమభర్తలతో వడిన రంగమ్మ పేరుచెప్పుకొని రోజూ దీపం పెట్టుకొని యామె యుపకారమని మెచ్చుకొనుచు అన్యోన్యము ఉత్తరప్రత్యుత్తరములతో స్నేహాలతను పెంచుకొనుచున్నారు.

# శశికళ.

(సుధానిధి)

పాలకొండ గ్రామము నేడు పాడరినామమాత్రావశేష మైనది నేటికిని ఆకొండ చరియనందొక గొప్పదుర్గము ప్రాకార మధ్యమున సురక్షితమగు చక్కని గ్రామము నొకప్పుడు మహావైభవ మనుభవించినట్లు లీలగాద్యోతకమగుచు నేయుండును. క్షీరముకంటెను రుచ్యములైన జలమొసంగు జలధారలాకొండ కనేకములుండుటచేతనే యానామ మన్వర్థమైనదని స్ఫురింపగలదు. ఈపాలకొండ కధినాథుడై యొకరెడ్డి పాలించుచుండెడివాడు. చిన్నగ్రామమన్న మాటయేకాని యందుగలవారెల్లరు యోధాగ్రేసరులైన రెడ్డివీరులగుటచే ననేక దివ్యభవనములందలరారుచున్నవి. 17 వశతాబ్ద ప్రాంతమున ఫ్రెంచివారు నింగ్లీషువారు వర్తకులై వచ్చి రాజ్యసంపాదన మొనర్చుకొన బ్రయత్నించిన కాలమున నొకనాటిరాత్రి పాలకొండయంతయు సైన్యసంరంభముతో గలకలలాడుచున్నది. సంసారులెల్లరు దమభవనములందు సుఖనిద్రాతత్పరులైరి వీధులవెంబడి సెవ్య

రు సంచరింపరా దనికూడ ముద్రలయుండుటచే నెవ్వరు బైటికి రాజాలకపోయిరి. పాలకొండకు నేటి రేపట పరాసులు దండెత్తి నున్నారని తెలియుటచే నందులకై గూఢచారులెవ్వరిందు జేరి రహస్యములు వెలిబుచ్చకుండ గమంగికు గట్టుదిట్టముగా సైనికులే నిమిషనిమేషము గస్తీ తిరుగుచున్నారు...ఆనాడు పాలకొండలో నూతనాగంతకులెవ్వరులేరు. కానియొక వీరపురుషుడెవడో సంపూర్ణతనుత్రాణశిరస్త్రాణములతో కటికీలితఖడ్గరాజముతో నొకసందునబడి దీర్ఘాలోచనాతత్పరుడై నడుచుచున్నాడు. గ్రహచారవశమున కారుమబ్బుగ్రమ్మి యాతని గమనమున కంతరాయము గల్పించి గాఢాంధకార బంధుర మొనర్చుచున్నది. ఆతడు మాటిమాటికి వెనుకముందు లరయుచు "అయ్యో! నియమితకాలమున కాతని గలసికొన జాలనేమో కదా భగవంతుడా యనుకొనుచున్నాడు. ధైర్యముతో మెల్లగ దడుముకొనుచు నందెన్ని వంకరటింకరలున్నవో యన్నియు జుట్టికొని నడకసాగించుచున్నాడు. పోనుబోనాసందు సన్నమైపోవుచున్నది. పొరపాటున దగ్గిరదారియని యీమార్గముపట్టి నందులకు తగిన శాస్తియేయగుచున్న" దని తన్నుదానేవగించుకొనుచున్నాడు. ఇంతకు గస్తీ తిరుగు సైనికులకు గనంబడరాదనియే యాతని సంకల్పము. కాని ప్రక్కసందులో సైనికార్భాటములు వినంబడుచున్నందుకుగల నిశ్శబ్దత్వము భేదించుటచే నా

లెడొక వేళ నీసందునకుకూడ వారేతెంచి తన్నేయింప నోపున నియేయంత యులజడిపఱుచుచున్నాడు. సందు తుదకొక పిట్టగోడ సమీపించి యంతమయినది. తత్కాలమున సంఘటిల్లిన మెరుపు సహాయమున పిట్టగోడ యవతల నొక యగాధమైన పల్లమునందు వివిధ వృక్షరాజములున్నట్లు చూడగల్గి యొడలు ఝల్లుమన, నిశ్చయముగా దారితప్పితిని, అని యుస్సురని నిట్టూర్పుబుచ్చినాడు. తిరిగిపోవుదుమని వెనుదిరుగునంత ఆసందునబడియే సైనికులు కొరివిపాలకరళ్ళిల కాగడాలతో విచ్చు కత్తులతో మధుపానాయత్తమైన విజృంభణములతో తనవైపునకే వచ్చుచున్నట్లు స్పష్టముగా గోచరించినది. ఒక్కత్రుటిలో నాతడు ఖడ్గముకై చేయువైచి రానిమ్మని కొన్నాడు. కాని వెంటనే „తానట్టి విషమతరుణమున బైలుపడి కార్యవిఘ్నమైన ద్పరాదని పరిశీలించి యొండైనదాగి తప్పించుకొన ప్రయత్నించెను. ఆసందు కిరుప్రక్కల రెండు భవనరాజములు నిండుకొండవంటి యెత్తైయిన గోపురములవలె నక్కడ నాక్షణకటిలో సీతనికి గోచరించి నిశ్శబ్దనిరంజనములై భయముగొల్పినవిగాని దాగొన దావుగాన్పించలేదు. అయినను నమకుదుమని యందొక భవనమునకుగల సింహద్వారము సమీపించి చూచెను తలుపులు తడిమెను వ్రాసిచూచెను, ఆశ్చర్యజనకముగా నయ్యవి బంధింపబడకుండుటగాంచి సులువుగ చప్పుడుగాకుండ

తెరచి తలుపుచాటున దాగొని సైనికులకై జూచుచుండెను. అప్పుడే సైనికులక్కడకు వచ్చి యీతని జాడగనిపెట్టిరి కాన యెవరు వారన్నంతలోనే యీతడిట్లేదు జేరుటచే వారు పిట్టగో డయుంతటా వెదికి వెదికి భ్రిమయే మోయునుకొని చక్కవెళ్ళు చున్నారు. వారట్లు జాగ్రత్తగా తనకొరకు బరిశీలించుటలో జాగ్రత్త తనకును మంచిదికదాయని తలుపులు దగ్గరగావైచెను. సైనికులు మాటసవ్వడిదూరమైన తరువాత తలుపులు తెఱచి బైటికిపోవుదుమను కుతూహలముతో తలుపులు తీయబ్రయ త్నించెను. కాని యద్భుతముగా నవి దగ్గరకునొక్కొనిపోయి రాలేదు, ఆచీకటిలోననేక విధముల బ్రయత్నించిచూచెను, కార్యసాఫల్యమొందలేదు అవియొక మీటవలన నట్లు మూ యబడిపోయెనని కొంతసేపటికి గ్రహించి యొకమోసములో మరల దాను బడితినని విధ్ధాంతపోయి గృహాంగణమునకై దృ ష్టినిగిడ్చెను యెక్కడను మనుజునలజడి కాని వెలుతురు కాని గానరాలేదు చీకటిలో బరిప్లుతమైయున్న దా మేడయంతయును ఏమికానున్నదో యిక సాహసించి లోన బ్రివేశించి యెను రొక్కనుటయే కర్తవ్యమని స్థిరపరచుకొని అట్లే యప్పుడప్పుడు వచ్చు మెరపుసహాయమున మెల్లగ నాకడనున్న సోపానపంక్తి నధిరోహించెను, పైయంతస్తువరకు దన్నదికొనిపోయెను, అక్క డ నొక చిన్నదీపము వెలుతురు అనేక గదులు యావతలనున్న

ట్లతనికి గోచరించెను. తలుపులన్నియు తెరువబడియుండుటకును సింహద్వారమునకట్లు మీాట యొగ్గబడియుండుటకును గారణ మూహింపనేరక తుదవరకు జూడవలసినదే కదాయని లోనికి నడచెను.

౨

ఈతడట్లు విశాలభవనము ప్రవేశించి యందొక శతవృద్ధు పట్టుపరపులమర్చిన సోఫాపై సుఖాసీనుండై తనవైపునకే చిరునవ్వుతో దదేకదృష్టితో జూచుచున్నట్లు కనిపెట్టి ధైర్యముగా సమీాపించి ,,ఆర్యా! పెద్దలు మీారెవరో నాకు తెలియదు, మాదియూరు కాదు ఈయూరంగలయొక చెలికానితో గలిసికొని యొక ముఖ్యవిషయము మాట్లాడిపోదుమని సాయంకాలముననే యీపురము ప్రవేశించి ఘాటకూళ్ళ ఇంట భుజించి వారియింటికై బయల్దేరి దారి తప్పి సైనికులు గస్తీతప్పించుకొనుటకై యీయింటిసింహద్వార మీాటలో జిక్కుకొన్నాను. ఇదియీయితివృత్తము. మిమ్ములజూచిన రెడ్డికులస్తులు మహాయోధాగ్రేసరులై యనేక సంగరాంగణ తాండవ మొనర్చిన వారని తోచుచున్నది. మాయూరు రామనగరము. నాపేరు రామిరెడ్డి,, అన్నాను. ఆముసలి యాతడింతవరకు చిరునవ్వుతో విని విని యెదుటనున్న కుర్చీపై నాసీనుడవుగమ్మని చేసన్నయొనర్చి ,,నాయనా నీవెవ్వరవో నాకక్కర లేదు! నీవిప్పుడిక నాయ

ల్లుడవై వచ్చినావు! నీబొంకులు నాకు పనికిరావు, ఈమాట ని న్నుపట్టుటకే యిట్లు నాచేనిర్మింపబడినది. కావున దొరకితివి. మహాభిజాత్యముతోఁ గూడిన మాకుటుంబ మర్యాదవమ్మయిన విధానమున నీవు ప్రవర్తించుచున్నావు. నిన్నింక వదలను. నో రముమూసికొని అరుస్సులోఁ గూర్చుండుము. క్షణములో నీపేర్వ్రాసి సమర్పించి యథావిధి వణిగ్రహణ మొనర్తువుగాని,, అని యాంతడత్యద్భుతాశ్చర్యముల మునిఁగికొని తెల్లబోయి చూచుచుండ తీవ్రముగా వాక్రుచ్చెను. రామిరెడ్డి ఈయసందర్భప్రలాపములువిని యాతడొక పిచ్చివాడేమో యని సందేహము కల్గి ,,తాతా! నీమాటలబట్టి నీవార్ధకతా దోషమున పిచ్చిపట్టునట్లున్నది,, అని హెచ్చరించెను.

వృద్ధ—(వకవకనవ్వుచు) కాగిచల్లారిన పాలకు పొంగేమిటి? యువకశ్రేష్టుడవు నీయిప్పటి యవస్థయే యొక విధమైన పిచ్చియని పెద్దలు చెప్పుచువచ్చిరి, కావున నూరకవృథాజల్పము లొనర్పక వృద్ధసింహమును క్రుద్ధ మొనర్పకుము!

రామి.— నీది పిచ్చియే కాకపోయినచో నీకథయేమో నాకేమియు నన్వయింపకపోవుటేల? నీవనుకొను యువకుడను నేనుగాను.

వృద్ధ—నీవేయని నీవిప్పుడిక్కడకు వచ్చుటయే ధృవపరుచుచున్నది. ఇక మా బిడ్డకును ఒకక్షణములో నీవధువు సవి

పించి వివాహమయ్యెదవు కాని.

రామిరెడ్డికి తలగింగురుమన్నది వృద్ధుడేమిటి? ధైర్యమేమిటి? వధువేమిటి వివాహమేమిటి తానేమిటి తనయల్లుడేమిటి? యని యొక్కసారి తనహృదయము ననేక విధప్రశ్నలు వైచుకొని సమాధానము చెప్పుకొనజాలక ఛీ! యిదియొక మహామోసము. అని భరుగ్గిన వాలు బెరికి నిలుచుకొనునంతలోనే వృద్ధుపకపక నవ్వుచు నీవంతటివాడవని కూడ విన్నాను. నీ వలన నాకావంతయు భీతి కలుగకుండగనే జాగ్రత్తపడినాను. అని చేసన్నఁగొనఁగ ప్రక్క గదులలో నుండి సంపూర్ణకవచధారులైన యోధులు పలువురు రామిరెడ్డిని సాగవ పుష్పరముగనే దూరముగనే విచ్చుకత్తులతో అధరస్పందనమైన నాడకుండ త్రుటిమాత్రమున వచ్చి నిలచిరి. రామిరెడ్డి ధైర్యసాహసవంతుడు కాకపోలేదు. దీని నిజమేమో తెలియుటకేలాగిన కత్తినొంటిలోనికి దూర్చి ,,తాతా! నీవొనర్చుచర్యలు నీవాడు మాటలు కేవలము క్రూరములు ఘోరములు అబద్ధములునై యున్నవి, అని కండ్లెర్రజేసిగర్జించెను.

వృద్ధు—(చిరునవ్వుతో) కుర్రా! తొందరపడకుము ఎవరివబద్ధములో దైవమే యెరుగును చివరవరకు సాక్ష్యము సంగుచురాదు దారి చూపించి మిగతా బుజువు పురుషులకు వదలును ఇంతవరకు నేనాకుటుంబాభిజాత్యము కళంకిత

మొనర్ప బ్రియత్నింగినవాడవు,, అని నేను ధృఢముగా జెప్ప గలను. నీకింకా రుజువుకావ లెన్నచో నొక్క నిముషములో జూ పింతును, అని యుచ్చరించినంత యొక వృద్ధబ్రాహ్మణుడు మరొక గదిలోనుండి ప వేశించి మహాప్రభూ! సర్వముసిద్ధముగా నున్నది. దయచేయవచ్చునన్నాడు. వృద్ధులేచి ,,రామిరెడ్డి, రా! నా వెంటరమ్ము! నీకు భయంబునకన కాశమెంతమా త్రము నులేదు. కొత్తమార్గము ద్రొక్కుచున్నందులకు క్షమింపుము. కాక నాయభిమతమునకు వ్యతిరేకమొనర్ప బ్రియత్నింతువో రేపు నీకు సూర్యోదయ దర్శనభాగ్యముకూడ నుండదు. గ్ర హించుకొనుము! అని ముందునడువ నారంభిచెను. రామిరెడ్డి దుర్భరాశ్చర్య మగ్నమానసుడై ,,కానున్నదికాక మానదు తుదకెట్లు బ్రత్నింతుము,, అనుకొని వెన్నంటినడచెను. అట్లువా రిద్ధరుకొన్నిగదులదాటి యొకదివ్యాలంకరణ శోభితమగు గ దిలోనికి బ్రవేశించిరి.

3

అలప్సరాంగన నధఃకరించి నొక బాలికామణినవనవో న్మేషా వ్రిగల్పములో దేదీవ్యమానమై ఉన్నారాలై తలచించు కొని నిలుచుకొని యున్నది.

వృద్ధు—తల్లీ! శశికలా? యిదేసరసుడిదే వచ్చినాడు! యిక వీని నొప్పించి వివాహమునకు సిద్ధముగమ్ము!

శశికళ — (నిర్వైరతతో రామిరెడ్డిని వీక్షించి) అయ్యో తండ్రీ! యీమహాత్ముఁడెవఁడో నేనెఱుంగను; అని తండ్రితోఁజెప్పి రామిరెడ్డితో సానుకంపా ప్రద్యోతకముగా "మహాశయా! నిజమాడియొకయబలాజన సంరక్షణ మొనర్పరాదా యనెను.

రామి — ఓ బాలకామిని! యిప్పుడర్ధమైనది నేనింతవరకు ఈభవనము ప్రవేశింపలేదనియు నేనిదే వేఱొక మోసమున నిందు జిక్కితిననియు మీతండ్రితో జెప్పియున్నాను. పూర్వపుణ్యలోకము యొక్క పాదధూళి మోసికొని నిష్కళంక ప్రవర్తనుఁడగా దగిన నావలన నీకెట్టియపాయమును గాదని నేనిదే నాగ్గాన మొనర్చుచున్నానని కత్తిముట్టి ప్రమాణ మొనర్చెను. వృద్ధుఁడు వీరిర్వురచర్యల దీప్యద్విస్ఫులింగములట్లు నేత్రములు మెఱయుచుండ "ఓయువతీ యువకులారా? మీరింక నామాట యాఖరుసారి నాలకింపుడు, మీరుభయులు కొన్నినాళ్లనుండి యన్యోన్యసందర్శనాదికములతో నీభవనమున మాకుటుంబమర్యాద మన్నగల్పు చున్నారు; ఇది యింక లోకులు నోళ్ళకెక్కక పూర్వమే మీరుయుభయులు దైవసన్నిధిని నేఁడే వివాహితులుకావలెను- మీబొంకులు నేను విశ్వశింపను- ఒకవేళ బొంకయినను బరిగణింపను- దైవఘటనమిట్లున్నది. తండ్రినగు నాకు కన్యాదానాధికారమిట్లు తీరగలదు- వినుచున్నావా "రామిరెడ్డి! నీ

కింకొక రెండుగంటలగడువిచ్చినాను. నీవిందే యుండి మీరుభ
యులు సంప్రతించుకొని వివాహమునకు సన్నద్ధులుగండు;
లేదా నే మొదట చెప్పినదే ప్రతిన! రేపు సూర్యోదయమును నీవు
చూడజాలవు,, అని గభీలున తలుపుమూసి తాను చక్కవెళ్ళె
ను- రామిరెడ్డి ప్రక్కనేయున్న సోఫాపై జతికిలబడి యూర్చే ని
ర్ఘాంతపోయి యాబాలికకై జూచుచుండెను. శశికళయు ప్ర
క్కనేగల బల్లపై మేనువ్రాల్చికంటికిమంటి కాకేధారగా నే
డ్చుచుండెను.

రామిరెడ్డి మహాపౌరుషశాలి! బసునికై లగ్నమైనబాలి
క నెట్లు వేఱొకదృష్టితో జూడగలడు? ఆమెయిష్టమునకు వ్య
తిరేకమొనర్పనని యిప్పుడే ప్రమాణముకూడ జేసియున్నా
డు. కావున నాతనికొక్కటియేదారి- రేపు సూర్యోదయము
చూడకపోవుటలో తనకత్తి నాధారముచేసికొని పైబడుచున్న
వీరలోకములో నొక కొందరికైన సహాయమొనర్చుకొని వీర
స్వర్గము చేరుటయే స్ఫురించినది- స్ఫురించినతోడనే మోము
నందు చిరునవ్వుతొలకరించినది. దైవముతో సగౌరవముగా-
శశికళా! నీవేలయేడ్చెదవు? శపథమొనర్చినరీతి నీకేవిధమైన
మానభంగము పొసగనీయను! నీవు ధైర్యపడుము అన్నాడు-
ఆమెయు పాపము పరపురుషుడు నూతనాగంతకుడు తనకొఱ
కై ప్రాణములువదలనున్నాడేయనియే ఏడ్చుచున్నది. మహా

శయా; నీసాహసమత్యద్భుతము! నీత్యాగము మహాధన్యము. నేను మహాపాపురాలను. కఠినహృదయను. నన్ను క్షమింపుము అని యశ్రుధారలతోనే యాతని నాపాదశిరఃపర్యంతము చూచెను! అవర్చస్సు, అధైర్యము, అపరాక్రమసంపన్నమైన యువయివ సౌష్టవము వీటినన్నిటికిని వన్నెదేనున్న నేటి త్యాగసంసిద్ధత కన్నులగట్టినట్లు విలోకించెను- తన మనోహరుడా నాడు రాకపోవుటయు నితడిట్లు తన్ను సమీపించుటయు నామె కత్యంతాశ్చర్యము గల్పించినవి. నిమిషనిమేషము రామిరెడ్డి సౌజన్యము నూహించి శశికళ యద్భుతపడిపోవుచున్నది.

అయ్యో! తనమూలమున నీయువకుడిట్లు మాడిపోవలసినదేనాయని ప్రతినిమిషమామె ప్రశ్నించుకొనుచునే యున్నది. రామిరెడ్డి నిశ్చలుడై తన యెదుటనున్న గజేంద్రమోక్షాతురుడైన శ్రీమహావిష్ణువు రూపపటమునకై జూడ్కి నిగిడించి చిరునవ్వుతో దిలకించుచుండెను- గంట, గంటన్నర, రెండుగంటలు కావచ్చినది- ఆఖరు నిమేష మాసన్నమైనదని యిర్వురు గ్రహించిరి- శశికళ మెఱుపుతీగవలె గడగడలాడిపోవుచున్నది. రామిరెడ్డి లేచినిలబడి తలుపునకై చూచుచుండెను. శశికళ యేమోకాని తటాలున వచ్చి యాతనికాళ్ళపైబడి రక్షింపుము రక్షింపుము; నేపొరబడితిని; నాకొరకై నీవిట్లు ప్రాణముబాయు జనము. నేను నిన్ను. అనునర్ధోక్తియందే రామిరెడ్డి బాలికామ

ణీ! భయపడకము. నాయందలి కరుణచే నీవట్లు తొట్రుపడుచు న్నావు! శత్రుజీవులప్రాణమువాయువుకంటెను పలుచనై చలన మొందుచుండును. నీకేవిధముననుహాని కల్గింపను. అని చెప్పు నంతలోనే తలుపు తెరువబడి వృద్ధుడు ప్రత్యక్షమయ్యెను. శశి కళ విరచుకొనిపడి మూర్ఛనొందినది.

ర

వృద్ధులోనికి ప్రవేశించి చిరునవ్వుతో వధూవరుల యొప్పందలమైనదా? యని రామిరెడ్డిని ప్రశ్నించెను. రామిరె డ్డి క్రోధము సణచుకొని,, ఓయి! కూరవృద్ధబకమా! నామా ట యొక్కింత వినుము. నీపిల్ల వరించిన మనోహరుడను నేను గాన నియెదుటనే మేమిరువురము నిశువచ్చ జెప్పినాము అన్యాయత్తై మైన నీకూతురు సవిధముగ వివాహమొనర్చుకొనను. నియిష్ట ము వచ్చినట్లు పన్నువెదిరించి నాప్రాణము హరింపజూచుము కొన యూపిరియున్నంతవరకు నాఖడ్గమరివర్గముల నెరుకాడక మానదు,, అని కత్తిబైటికి లాగి ఝళిపించెను వృద్ధు పకపకన వ్వుచు మహాయోధుడవు; సంతోషించుచున్నాను గాన నేనొక సారి సంకల్పించినది మార్చుట నాకీజన్మమునందులేదు నీవు నూతనుడవైనను పరిచితుడవైనను ఇంక నాపిల్ల పెండ్లాడుట యో మరల సంగతి లోకమునకు తెలియనవసరము. లేకుండా నిక్కడనే నిహతుడవై మాయా యుద్యానవనమునకు దోహ

దమగుటయో రెండేషరతులు. నీవుకోరినట్లు యుద్ధము చేసియే చావవచ్చును. తయారుగనుండుము. తొలికోడికూత యొక్క గంటకాలమున్నది. ఇంతలో నీయిష్టదైవమును ప్రార్థించుకొనుము లేదా కత్తిదాని నొప్పించి పెండ్లికైన స్థిరపడుము; అని తటాలున మళ్ళీతలుపులు బిగించి వృద్ధుచక్క వెళ్ళెను. రామిరెడ్డి యిష్టదైవము రాముడే! భూలోకమున నింక నిష్టదైవమనదగిన కాంతారత్నము తటస్థించలేదు. తటస్థించిన శశికళ కథ యిట్లున్నది. ఎల్లప్పుడూ తలచుచున్న రామునప్పుడు తలవనక్కరలేదుకదా! ఇక నా శశికళా తనూతయట్లుతన పాదములకడ మూర్ఛాక్రాంతయైపడియుండుటచూచి యటనే భృంగారువు నందలి నిర్మల సలిలమామె ముఖారవిందముపై జల్లి పేదరెగ్గెను. శశికళా తాని పిలిచెను. ఆమె లేచి దూరమున్నబోయి అశ్రుధారల నాపుకొనజాలక అయ్యో! మా తండ్రి-తుదియాజ్ఞయిచ్చి వెళ్ళినాడా! యన్నది. రామిరెడ్డి అవును వెళ్ళినాడు తొలికోడి కూతయే నాతుదినాడియూతగా విశదీకరించి చక్క వెళ్ళెను. అని నచ్చజెప్పెను.

శశికళకు దుఃఖముపొంగి పొరలిపోయినది. రామిరెడ్డి త్యాగశీలమే తన హృదయావేశముప్పొంగించినది. రామిరెడ్డి యామెదుఃఖమున కేమికారణమో యని యిప్పుడనుమానించెను.

రామిరెడ్డి—ఓయువతీ తిలకమా! నీకింకను దుఃఖమేల?

శశికళ—అయ్యో! అట్టిధైర్యశాలి ప్రాణహరణోద్యోగమునకు గారణముగా బరిణమించిన దుఃఖాపని జీవముండునా?

రామిరెడ్డి—ఇందు తప్పేమున్నది? ఈరోజునవే నిట్లుగ తలంచినయెడల బహుశః నీనాధుడు రేపురావచ్చెను. రేపును నిల్లే యావృద్ధు మీటరయొగ్గి పట్టి నీకు ముడివెట్ట యత్నింపక మానడే! యేలనీదుఃఖము.

శశికళ—దుఃఖమాపుకొనజాలక భళ్ళున నాతని పాదములపైబడి ,,ఓపురుషవతంసమా! క్షమింపుము నామనోభిలాషతో నీప్రాణము దీయజాలను! నీయూపు సౌందర్యము నా కన్నులు మిరుమిట్లు గొల్పుచున్నవి, తిరస్కరణయా మనవి చేయుమను. ఆతనితో నుత్తరములతోనే యెప్పు అన్యోన్యస్నేహమై నెరుంగను. మాతండ్రియట్టి శేఖరునకిచ్చి వొంటరిమనోవి గట్టి మాయోపాయమున నాతని రావించి నేనిట్లు రహస్యముగా నుత్తరప్రత్యుత్తరములుజరుపుట తనకుటుంబ మర్యాద కళంకమని యెంచి యిట్లు వివాహము బలవంతముగా జరుగుటయే శాస్త్రియని సంకల్పించినాడు; అని మరల మోకరించి యోమనోహరా! నన్నునుగ్రహింపుము నీచరణదాసిగానైన బరిగ్రహింపుము. మనోవాక్కాయములుగ నీవేనాయభీష్టములు అని

ప్రిదాకాంక్షిణతురాలయ్యెను. రామిరెడ్డి తటాలున నామెను రెండుకరముల లేవదీసి తనకు హృదయసమీపస్థమైనదని చెప్పుటకోయనునట్లు బిగ్గగాగిలించి ,, ఇప్పుడు నేను ధన్యాత్ముడనైతిని· యుత్కృష్టగ నొక్కసారి మధురాధరము నుముద్దుగొనెను.

ఉదయమునకే వధూవరుల వివాహము పూర్తియైనది. రామిరెడ్డి తానసలు పాలకొండ వచ్చుటలో నాంగ్లేయుల రాయభారము నాయూరిమంత్రి శేఖరున కందించుటయునియు నట్టిదిట్లు పరిణమించినట్లును మరునాడు మామాఅల్లుండ్రు సుఖాసీనులై ముచ్చటించుకొనిరి







# నేడి దేయరుణోదయము





(గా. సు)

కనకమ్మకు తలిదండ్రులు చిన్ననాటనే గొట్టాలమ్మవలన చనిపోవుటవలన ముత్తవ్వయేయాధారమై పెంచవలసివలసి వచ్చినది. ఆమె స్వగ్రామమగు కిర్లంపూడియందుగల యిరుగుపొరుగు వారి యాదరమున నైననేమి, ముత్తవ్వ బుచ్చమ్మ ప్రేమచేనైననేమి, కనకమ్మ చక్కని గారాబముగా పెరిగి ఆడబడిలో నాలుగవక్లాసు వరకు చదువుకొని యిప్పటికి 12 సంవత్సరములలే బ్రాయమువచ్చి మిసమిసలాడుచున్నది తండ్రి యాస్తికంతయు దానే వారసురాలౌటచేతను నింత యన్నమునకు గుడ్డకును లోటులేని సంసారమగుటచేతను కనకమ్మకే లోపము లేకుండ నేయిప్పటివరకు జరుగుచున్నది ముత్తవ్వ బుచ్చెమ్మగారు మంచి తెలివితేటలుగల యిల్లాలగుటచేత గడుంగడు జాగరూకతతో మళ్ళుమాన్యములు స్వయముగ జూచుకొనుచు మనుమరాలిని పోషించుటలోను మంచి విద్యా

బుద్ధులు గఱపుటలోనే ఏమరక తనకువచ్చిన యాపదలమధ్య మున నక్కయొక కంటితో దుఃఖించుచు గాలక్షేపమొనర్చుచున్నది. పెండ్లియీడువచ్చిన కనకమ్మ వివాహముగురించికూడ నామెయేశ్రద్ధవహించవలసియున్నది కదా! దగ్గరసంబధమెద్దియునులేదు. నాగరికమే గతియగుటచే సామర్లకోటలోనున్న పాటివారి యింటగల నొకయువకునికిచ్చి వివాహమొనర్ప ప్రయత్నించుచున్నది. కనకమ్మ ముత్తవ్వయందు మిక్కిలి భక్తి శ్రద్ధలుకలదై సహజముగా జ్ఞానమువచ్చినదయ్యు దనవివాహము విషయమై ముత్తవ్వయే నిర్ణయసామర్థ్యము కలదని మనస్సమాధాన మొనర్చుకొని పెళ్లిమాటలు జరుగునప్పుడెల్ల నునుసిగ్గుతో ముసిముసినగవులతో నోసరిల్లిపోవుచున్నది. తుదకు సామర్లకోట సంబంధమే కుదిరి వరుడగు రామారావునకు వివాహము చేయ నిశ్చయింపబడి క్రమక్రమముగా పెండ్లి జరిగిపోయినది.

కనకమ్మ పెండ్లియైనది మొదలు బడిమాననవలసివచ్చినది. వత్తాను వచ్చుచున్నది. ఇంటికడనే యనేక పత్రములు నవలలు నాటకములు ప్రబంధములు చదువుకొనుచు రాజమండ్రిలో జదువుచున్న తనమనోనాథుడు రామారావంపించిన యుత్తరఖండకావ్యములు వెంకిపాటలు పొట్టికథలు చదివి లోకజ్ఞాన మలవరచుకొనుచు మెల్లగ భావిసంసారయాత్రకు సర్వం

గా మొనర్చుచున్నది. కాలమొక్క రీతిగ వెళ్ళునని యెవ్వరనగ
లరు? ప్రారబ్ధవశమున రామారావునకు రాజమండ్రిలో మొ
దటిరోజున జ్వరమనియు రెండవరోజున మశూచికమనియు నా
ల్గవరోజున రామారావు పరమపదించెననియు సహస్రశతఘ్ని
కాశనిపాతమువలె కనకమ్మకు తెలియవచ్చె. యాసుకుమారల
తాను తల్లికనూర్పుల్లి శోషిల్లతనొవర్చెనది- బుచ్చెమ్మ దుఃఖ
మునకు మేర లేదు- ఇక మంచము దిగలేదు- కనకమ్మ కాధార
శూన్యమగుచున్నది. ఇరుగుపొరుగువారి దయాధర్మమున బం
వంతముపై కనకమ్మ భోజనము నాలుగైదు పూటలకు కొకపూ
టగా జరుగుచున్నది. బుచ్చెమ్మ మనోరోగమునకు మందులేక
కొద్దిరోజులకే కనకమ్మకు బూర్తిగా దిక్కుమాలినదా
న్నిగానొదల్చి దివంగతయైపోయినది. కనకమ్మకు భూమ్యాకా
శము లేక మొనర్పదగిన గాఢాంధకార బంధురమైన దుఃఖస
ముద్రములో మునిగిపోయినది- తల్లి దండ్రి, భర్త, తుదకు
ముత్తవ్వయు పరమపదించిరి. తానో పదుమూడేండ్ల పసికూన!
భగవంతుడున్నాడనియు నామెను రక్షించుననియు నెవ్వరింక
నమ్మగలరు?

కాని ప్రక్కయింటి ముసలాయన వెంకటశాస్త్రి యా
దినుండియు కనకమ్మ తాతతో సహాధ్యాయియై యాకుటుంబ
ముతో చిరపరిచయ వాత్సల్యములు గలవాడగుటచే వెంటనే

యాదుకొని కనకమ్మ నోదార్చుటకు మాటలేమియు వినితొ గింపజాలక తానును రుద్ధదుఃఖపూరితగాత్రుఁడై యామెను దన యింటికిఁ గొంపోయి తాను దనభార్యయు నత్యంత ప్రేమాతిరేకమున గంటికిరెప్పవలె కాపాడ మొదలిడి, యనేక పురాణగాథలామెకు దుఃఖోపశమనార్థము పన్యసించుచుండెను. కనకమ్మ యత్తవారామె యాస్తికొఱకై యొకసారి చూడవచ్చిరి కాని వెంకటశాస్త్రియే వాసిపోయిన కూటికింత యాతురతయేలయని గద్దించిపంపివైచెను.

వెంకటశాస్త్రి కుమారుఁడు శంకరశర్మ రాజమండ్రిలోనే విద్యోచముప్పుచున్నాడు. కనకమ్మయు దాను బాల్యమున నొండొరులనెడివారే! యేకరూపములేకుండను. కాని ఆస్తిసదర్భమున గొప్పభేదముండుటచే వారికన్యోన్యసంబంధము లెవ్వరును దలపెట్టలేదు. వెంకటశాస్త్రి కడుంగడు బీదవాడు. ఒకప్పుడు ముష్టికూడ నెత్తినవాడు ఇప్పుడు మహారాజవారి పాఠశాలమున కుమారుని కుచితముగవిద్యయు దనకింత యున్నమును సమకూడినవగుటచే గాలక్షేపమునర్చుచున్నాడు. శంకరశర్మ వేసంగిసెలవులగుటచే కొన్నినాళ్ళకే యింటికివచ్చి కనకమ్మ గాథ విని భోరుభోరున నేడ్చి యామెయు నడలగలదని ధైర్యము తెచ్చుకొని యత్యంత ప్రేమాతిరేకమున నామె నాదరింపజొచ్చెను. కనకమ్మయు శంకరశర్మతో బాల్యాంకక్రీడల నా

డుకొన్నదగుటచే నేడరమరలేకయే యాతనితో మొఱగబో
చ్చెను. వెంకటశాస్త్రి భార్య చాలపరమార్థజ్ఞానముగల యిల్లా
లు. కనకమ్మ యీమధ్యనే విధవత్వమైనప్పుడాను తానంత
యు దుఃఖంపనీయకుండ లాలించి రోజులుగడిపెను. కనకమ్మ
కింక వైధవ్యముయొక్క కాఠిన్యము స్పవవలె ముంచుకొని వ
చ్చుచున్నది. ఇంక నావంతయు సంఘము నా శృంగారవేషధార
ణ కంగీకరింపదు. ముండమోయవలెను. దిక్కుమాలిన వితం
తువునకు నా అన్నకేలెవ్వెడల నీసంఘనియమము మోటుల
కనికరింపగలదు! శంకరశర్మ యావ్యవహారము పూర్తిగగ్రి
హించెను. తల్లిదండ్రులా మేను వైవర్ణ్యమువర్బ శైథిల్యా సా
పాదించెదరని పూర్తిగ నెఱింగెను. కనకమ్మకు పాపమారానున్న
యాపత్తుగూరించి కించంతయు దెలియదు. యుపతి హృదయవను
ఘములో సెల్లగానుగలోబడిన చెఱకుముక్కవలె నలిగిపోవు
టయే సహజమనుకొను నంత ముగ్ధయైయున్నది. తనయువస
యలో నన్న ప్రారబ్ధకాలాగ్నిలోబడి దగ్ధమగుటయే అనన్యగ
తికమని యామె నిరాశాపూరిత మనఃకుట్మలమునకు సంక
ల్పము కావున నేమియు విలక్ష్యయుట లేదు.

శంకరశర్మ విజ్ఞానముగల యువకుడగుటచే శోకించుచు
రూడించి తనతండ్రితో రహస్యముగా కనకమ్మను విలంఘా
ద్వాహామునకు బల్కొల్పుట న్యాయమని సూచించెను. దా

తో వెంకటశాస్త్రి మండిపడి శంకరశర్మను బుద్ధివాదిట్టి యిక
నామె యిటనుండిన వాండ్లు చెప్పుదురో యను భయముచేత
నొకనాటిరాత్రి కనకమ్మను నెవ్వరికిని చెప్పకుండ బైటకుగొం
పోయి యొక్కడకో పంపివైచెను. శంకరశర్మ యుదయమునకే
యీవార్తవిని గుండెబ్రద్దలయి చేయునదిలేక వెంటనే కనకమ్మ
మరచిపోయినట్లే రాజమండ్రి పయనమై యేగెను.

వెంకటశాస్త్రి కనకమ్మను తనకు నమ్మకముయినవాని
కప్పగించి చామర్లకోటలో దానియత్తవారి యింటనప్పగింప
పంపివైచెను కనకమ్మకిప్పుడు జ్ఞాననేత్రము వికసించినది. ఆ
శాలత చిగిర్చినది. శంకరశర్మ తండ్రితో చెప్పుచుండుట దాను
వినదాటచేత వెంకటశాస్త్రి భయమునకు గారణమూహించి
నతోడనే యామెకు ప్రపంచకములో నొకమార్గము వితంతు
వులకున్నదని స్ఫురించెను. వెంటనే శంకరశర్మ పరోపకార ప్ర
వీణతకు మనస్సాహ్లాదమొందజొచ్చెను. తమబండియట్లు చామ
ర్లకోట సమీపించునప్పటికింకను నునుఁజీకటి యుండుటచేతాను
దనతోవచ్చిన యాముదుసలి నిద్రించుచుండుటచేతను మెల్లగ
దండిదిగి యద్దుదారిని బసివిరెడ్డి సత్రవునకుజని యందొక గది
లో బ్రవేశించెను. ఉదయమారుగంటలకేగి తనకడనున్న రూ
పాయచిల్లరడబ్బులతో గొన్నిటితో టిక్కట్టుకొని రాజమండ్రి
వచ్చి తిన్నగా నాళంవారి సత్రవులో జేరుకొనెను. శంకరశర్మ

యు మరునాడే బయలుదేరి రాజమండ్రి వచ్చునప్పుడు దారి లోగల చామర్లకోటలో కనకమ్మ యాత్రవారియింట వాకబు చేసి దానిలోనే ముసలివానివలన కనకమ్మ యుట్లుపరారియైన దనియు నెరింగి త్వరలో రాజమండ్రీవచ్చిచేరెను. సత్రములన్ని యు వెదికి తుదకు శంకరుడు కనకమ్మను నాళంవారి సత్రంలో కనుంగొన గల్గెను శంకరశర్మను జూచినతోడనే యాగదింగ ల కనకమ్మ తటాలున దుఃఖావేశమున శంకరునొడిలోబడికెవ్వు న కేకవైచి మూర్ఛిల్లెను శంకరుడు సంతోషధారాప్లుతలోచనుడై యామె నక్కునజేర్చి నిశ్చేష్టుడయ్యెను ఒక్కింత తడవకు తెలి వివచ్చి కనకమ్మ శంకరుని విదల్చుకొనబోయెను గాని శంకరు డు "భగవత్సంకల్పము మనలనింక విడదీయజాలదు నీవింక నాదానవేసుమా! యేలసంశయింతువు?" అనిబిగ్గరగ గౌగిలిం చెను కనకమ్మకృతజ్ఞతాసూచకానందబాష్పములతో నాతని వక్షస్థలమున నభిషేకమొనర్చి బాహులతల పెనవైచి నేడిదే యరుణోదయమని యాతనినోరూరముద్దుగొనెను శంకరుడు పు నఃపునరాలింగ వాదికముల సలరించి మోదార్చెను.

వారిద్వరు మూడవనాడే వీరేశలింగముగారితోటలో వివాహమొనర్చుకొని వెంకటశాస్త్రి రోషానలజ్వాలకుపాత్రు లైనను మన రాజావారి యాదరాతిశయము గడించి సుఖము గ నుండిరని పాఠకులే గ్రహింపగలరు.



# నా ఇంగ్లాండు పెండ్లి.



(సు ధా ని ధి)

౧

నన్ను నా తండ్రి యింగ్లాండు చదువుకొనుటకు పంపుటలో నాతనికి మరేగొప్పయుద్దేశము లేదు. నేను బారిష్టరై వస్తాననియే యాతనియాశ! నేను కతిపయ దినంబులకు బయాననై లండను జేరుకొన్నాను మొదటినుండియు ఖర్చుమసిపిని కాకపోవుటచేతను మాతండ్రి క్లుప్తముగా మాత్రమే ధనము పంపుదునని నచ్చచెప్పుటచేతను నేనొకమధ్యతరగతి యాంగ్లేయ కుటుంబమున చిరబంధువుగా జేరుకొన్నాను. వారు నెలకెంతయగునో యంతమాత్రమే దాచూపాయీని నావద్దపుచ్చుకొనుచుండువారు. వారికేటువచ్చినా నాకొరకు చేసిన యితరచాకరీలకు మాత్రము వేరేడబ్బుముట్టుచుండెడిది. అదియే వారికి లాభముగా పరిణమించెనిది నేను బ్రాహ్మణుడనయి

యుండుటచే శాఖాహారమే తినుచుండెడివాడను. మాంసము తినవలసి యెప్పుడూ చిక్కుపడలేదు మా యింటివారును దివ్య జ్ఞాన సమాజికులగుటచే శాఖాహారులయి యున్నారు. కోడి గుడ్లుమాత్రము వారుతినేవారు నేను ప్రత్యామ్నాయముగా బాగ పాదుంపలతో కాలక్షేపము చేసేవాడను. మేమందరము కలిసి యుండేవాళ్ళము. వారిదంత పెద్దకుటుంబము కాదు భార్య భర్త యిద్దరు కూతుండ్రు పెద్దయామెకు నేను ప్రవేశించు సరికి 20 యేండ్లున్నవి చిన్నయామెకు 16, యిద్దరకు పెండ్లిండ్లు కాలేదు. పెద్దయామెకొరకెవరో ఒక స్నేహితుడు వచ్చిపోవుచుండెడివాడు ఆసంబంధము కుదురునేమోయని తలితండ్రులువ్విళ్ళూరుచుండేవారు. చిన్నది యింకా కుర్రది ఈమె పెండ్లి గురించి వారికంతయావాయే పోదములేదు ఈమెబాగా చదువుకొన్నది కొంచెము మతవిషయక మయిన యాసక్తికలిగి నాతో మిక్కిలి చనవుగా నాగదిలోనికివచ్చి హిందూమత విశేషము లడుగుచుండెడిది నేను బాగానే చదువుకొనుచున్నాను.

-౨

ఒకనాటిరాత్రి పండువెన్నెలలో పయిడాబామీద పుష్పనికుంజముల మధ్య. ఆమెపేరు మేరీ. ఆమెయునేనూ మన హిందువుల దంపతీ న్యాయముల గూర్చి ప్రసంగమువచ్చి ప్రసంగించితిమి-

నేను—నీకు మా హైందవ దాంపత్యము యొక్క కట్టుబాట్లు తెలియవు!

మేరీ—నీవట్లా అననక్కరలేదు, నేను మీ పురాణములు కొన్ని చదివినాను మా బెసెంటమ్మ లెక్చర్లెన్నో విన్నాను. మీ దాంపత్యముగురించి స్పష్టముగా తెలియును కనుక నే భూగోళములో నెల్లమీ దేశపు స్త్రీలదృష్టవంతులని విన్నాను.

నేను—(ఆశ్చర్యముతో) మేరీ! నీవు ముఖస్తుతి యొనర్చుచున్నావు మా యాడవాళ్ళకున్న నిర్బంధములు నీకువచ్చినవని యోచించి చూచుకొనుము నీకు తెలియగలదు.

మేరీ—(చిరునవ్వుతో) మిత్రమా! వచ్చినచో నేనేధన్యురాలను. అర్జనబాధ్యత లేకుండ భగవంతుని యుద్దేశానుసారము సృష్టిస్థితిలకు కారకులయి గృహలక్ష్ములయి సర్వవిధముల భర్తనారాధించుట కంటె, స్త్రీభాగ్యము మరొక్కటి లేదని త్రికరణములా నమ్ముచున్నాను.

నేను—(సంతోషముతో) నెచ్చెలీ! నీయభినందనమునకచ్చెరువగుచున్నది నిజముచేత అన్యోన్యానురాగము గలముగళమయినచో మా హైందవ దాంపత్యము నీవన్నట్లు ధన్యమైనదే.

మేరీ—అన్యోన్య మనునది స్థిరమైనదిగాదు. స్థిరముగా నుండుట కూడ నసంభవము. మొదట మనస్సు లగ్నమగుటకు దగిన పరిస్థితులుండిన జాలును తరువాత నెన్నియొడిదుడుకులు వచ్చినను దప్పులేదు స్త్రీపురుషులిర్వురు నొక్కవ్యక్తియొక్క

యర్థభాగములనియు నసీజన్మ జన్మేష యట్లికలియక తప్పనని యు విశ్వసించినచో మిగిలిన చిల్లర వ్యగ్రభావము లెప్పుయు న్నను అనూచానమైన పారంపర్య సమీకరణముతో నాయుగ శము సుఖించునని నావిశ్వాసము.

ఇట్లు మేము రాత్రులు ప్రసంగించుకొన్నాము. నిజ ము దాచనేల? నాకంటె నాకుకే యెక్కువ చొరవ, చురుకు. మెలకువయు కలిగి కొద్దికాలములనకే స్నేహము, మోహమై దు రవగాహము కాజొచ్చినది. స్త్రీసంపర్కమే తరుచు సందర్భించ ని హైందవుడనగు నేను నిరంతర సామీప్యముతో స్త్రీపురుష వి వక్షతలేక సంచరించునామెకు మోహించుటలో నాశ్చర్యము లేదుకాని యామె నల్లవాడననియు తూర్పువాడననియు నన్నే వగించకమున దేశమునకు రాజులయి పాలించుజాతిలో బుట్టిన దనియు నన్నావిధముగ ప్రేమించి పెండ్లియాడుమని తనంతట తాను బ్రతిమలాడుట నాకుమనసు నీరుజేసివైచినది "ప్రియా! నిన్ను నేను పెండ్లాడుదునుగాని క్రైస్తవముపుచ్చుకొనజాల కా పోవగుననని యొకసారి ప్రసంగవశమున నన్నామెయనియొక్క మనోహరమైన చిరునవ్వునవ్వి వెంటనే మరునాడే యార్యస మాజములో జేరి యథావిధి సంస్కారములంది మిత్రమా! నే నుహిందువునేనా యని జాలికరముగ నన్నది. నేను నానంద బాష్పప్లుతనయనుడనై పరిష్కజేసిన నామెనాశ్లేషించి "ప్రేయ సీ! యింకధన్యుడ" నని మాత్రమనగల్గితిని.

మేము చెన్నపురి వచ్చినాము పెద్దమేడ యాద్దెకుపుచ్చు

కొన్నాము. నాయర్ధాంగియిప్పుడు మేరీ కాదు. ఆమెపేరు శార
దాబాయిగ మార్చుకొన్నాము. 6 వేల మైళ్ళదూరము తలి
దండ్రులవదలి నాకొరకు భర్తమీఁద ప్రేమావేశమున నిష్కళం
క హైందవ దంపతీసుఖమనుభవింతుమని వచ్చినశారదకయి
మహైక్యము కలిగిపోయినది ఆమెయు చీర, రైక, సిగ, బొట్టు,
కట్టునన్నియు బూర్తిగ హైందవసాంప్రదాయమవలంబించి ని
త్యానేకానంద కరమయినది. మరియొక చిత్రము! హ్యాటుబూ
టు సూటు వేసికొనివచ్చినది కాదు అవియన్ని నామె కసహ్య
ము కాబోలు! జాతీయమయిన దుస్తులతో నన్నలంకరించి నో
రార మేమిర్వుర మొంటరిగ నునప్పుడు "మనోహరరావు పం
తులుగారు! అనేదినాయొడలు జలదరించి యీమె యవ్యాజా
నురాగమున కచ్చెరువొందుచుండే వాడను చెప్పమరచితిని
"తానేబలవంతముగా మా తండ్రిగారికి ఉత్తరము వ్రాసి యెం
తో వినయవిధేయతలతో వారియెడలి నాటకు అంగీకారము
బడసియున్నది కావున మేము హిందూదేశము రాగానే నే
మిర్వురము మాతండ్రిగారున్న రాజమండ్రి వెళ్ళి వారిదర్శించి
యాశీస్సులొందినాము కాని మాతండ్రిగారు సంఘభయమున
మమ్ములను చెన్నపురిలోనే యుండనియమించుటచే నిపుడిచ్చ
టనే యున్నాము.

౪

మాశారద తెలిపితేట లెంతటివో చూడుడు! పరిశ్రమ
యొనర్చి యాంధ్రపు వంటకములన్ని నేర్చుకొన్నది నాకేవివి

రుజువీకరములో కనిపెట్టినది. అడుగడుగునకొక హైందవ దంప
తీ, సాంప్రదాయము నేర్చుకొని యలవర్చుకొని ప్రదర్శించు
చుండెడిది. పాపము విస్తరిలో తినజాలక యొకొక్కప్పుడు
జాలికలిగించెడిది ఆఖరున నేనేయెన్నోసారులు నచ్చచెప్పి కం
చములో తినునట్లంగీకరింప జేసితిని, కాని యొక్కటిమాత్రము
నాసరదా కనుక మార్చలేదు మేమిద్దర మొక్కసారియే దగ్గ
రదగ్గరగా కూర్చుండి భుజించెడివారము! ఆహా! పెండ్లిసంబంధ
మున కెంత దూరమున్న నంతమంచిదన్న నానుడిమా యెడల సా
ర్థకమైనదని నేనెంతయో గర్వించియున్నాను. నేను మా శారద
బీచియొద్దకు షికారెప్పుడో కాని వెళ్ళేవారముకాము పత్రికలకు
మాదాంపత్యము క్రొత్తగానుండి ముదట నవ్వులాటలకు దిగు
టయే కారణము కాని నేను మా శారద పూర్తిగా ప్రజలకు శా
శ్రదయముపోయినది ఆఖరునకు ఎంతగిట్టనివారయినా ఎంతక
యినా యింగ్లీషువారే తగుదురు చూడు మాయువతిని ఎట్లు
హైందవ చిహ్నములలో విలీనమయి పోయినదో యనిమాత్ర
మే యాశ్చర్య పడజొచ్చిరి తూర్పు పడమర రీతీయున కలు
స్తవని నాపేరాస కాని కొన్ని శతాబ్దముల వ్యవధియున్నదని
నాభయము! మాదాంపత్యములో ఏమిలోటూ మాకింకను, గన్ప
డలేదు భగవంతుడు లోటులేకుండనే శేయుగాక మొన్న నేమా
కొక చిన్నిబిడ్డడుకల్గినాడు. ఇంక మా దాంపత్యము చిగురు వె
ట్టినది.

---

# నా అరవపెండ్లాము.

మానాన్న నాకు బియ్యేవరకు చదువు చెప్పించుటకు
లో ముఖ్యముగా రెండుకారణములున్నవి. మొదటిది నేనొక
గొప్ప తహసీల్దారుడనౌదునని రెండవది సద్యఃఫలమైన గొప్ప
కట్నకానుకలతో సంబంధము కుదురగలదని ఈగొంతెమ్మకో
ర్కులు మనస్సులో పెట్టికొనియే చిన్నప్పుడు నాకెన్ని సంబంధ
ములువచ్చిన పారదోలేసినాడు, మాయక్కల పెండ్లిండ్లకు మా
న్యములమ్మియే కట్నములిచ్చినాడు! వున్నవి తాకట్టుపెట్టి నా
చదువు సాగించుచున్నాడు. మాబావమరుదులు ముగ్గురు మూ
డు దిక్కులావున్నారు. కలకత్తా, బొంబాయి, చెన్నపట్టణము
లు మూడు మా చెల్లెండ్రు అలాయిదా అత్తవారి యూళ్ళు!
మీతో నిజముదాచనేల కలకత్తా బావను నేచూడలేదు
బొంబాయి వానిని నేనెరగను ఆరెండు పెళ్ళిళ్ళు గ్రిహాచార
ముచేత నాపరీక్షల రోజులలోనే జరుగుటచే నేనుపోలేదు వా

రలు మళ్ళీ మాచెల్లెళ్ళ కార్యములు వారింద్లనే జరిగించుకొను
టచేత మా తండ్రిగారికి సుముహూర్తము కలుపుకొన్న అగునని
నాచదువు పాడగునని తెలుపనేలేదు ఆచెల్లెండ్రిరువురకు ఏ
మోకొంచెము పిల్లలు కల్గినారట మొన్న మాఅమ్మయుత్తరం
వ్రాసినది ఇదినాబంధుగులస్థితి. మాతండ్రి క్రిందటిసంవత్సరము
స్వర్గస్థులైనప్పుడు నేనింటికివెళ్ళి కర్మ జరిగించినాను నేను తిరిగి
యిక్కడకువచ్చిన తరువాత మాకలకత్తా బొంబాయి బావలు
పిల్లలతోవచ్చి మాఅమ్మనుజూచి వెళ్ళినారట! ఇక మాపెద్ద బావ
చెన్నపురిలోనే యున్నాడు. కావున తెలుచు చున్నాను
వీరికి పిల్లలులేరు. మాఅక్క చదువుకొన్నదగుటచే జాగ్రత్తగా
నే కాలక్షేపము చేయుచున్నది. నేను ప్రెసిడెన్సీ కాలేజిలో
చదువుచున్నాను. కనుక ట్రిప్లికేనులో నున్నాను. మా బావ
బ్రిడ్వేలో నున్నాడు. ఇప్పుడు నెలకొకసారి వెళ్ళిచూడగల్గు
చున్నాను. నాకు పెళ్ళికొరకు బుద్ధింకా పుట్టలేదు ఈనాన్కోప
పరేషనువచ్చి బ్రాహ్మణేతర సమస్యకు మాకు హత్తించి
బ్రాహ్మణులమగు మాకొంపలలో చదువు గౌరవము చంపివే
సినది సంబంధములు కావడం మానుకొన్నవి ఇట్టియెడ నేనొక
నాడు మాఅక్కగారి యింటికివెళ్ళి మాఅక్కతో కుశలప్రశ్న
లువైచి ప్రసంగిచు చున్నాను.

అక్క—ఏమిరా! ప్రకాశం పెండ్లిమాట యేమిచేసినావు?

నేను—యేమిచేయుమన్నావు రెండేడ్లనుండి యిక్కడనుండి పో యినానుకాదా? మనవాళ్లింతావున్న రామవరం చేరుకుంటేనే కాని యెల్లుసంబంధములు దొరుకుతవి?
అక్క—పోనీ ఒకే? మాయింటి ప్రక్కయింట్లో వున్నవారిపిల్లను పెండ్లాడరాదటరా? వాళ్ళు మనవాళ్ళేనట! చాలాకాలమైంది దక్షిణాది వచ్చుటచే నట్లు అరవల్లాగున్నారుకాని
నేను—అక్కా మనమాటఏమైనావాళ్లకు తెలియునా?
అక్క—తెలియకేమిరా! యాస అరవయాసకాని మాటతెలుగే మాట్లాడుతారు మనతోయేలాగైనా సంబధము కుదుర్చుకోవాలని యుందివాళ్లకి
నేను—పిల్లయేమి చేయుచున్నది?
అక్క—యేమిచేస్తుంది గోనగాపెరుగుచున్నది 16 యేండ్లు న్నాయి సమర్తాడిందేమో అంటుంనారు,
నేను—అదికాదే చదువుకుంద్
అక్క—చదువుకోను చదువుకుంది! హార్మోనియం పిడేలుకూడా వాయిస్తుంది.
నేను—అయితే నాకుద్యోగము దొరక్కపోయినా అదిమేళ్యం అయినాచేసి నాపొట్ట పోషింస్తుందన్నమాట!
అక్క—(నవ్వుచు) మేళ్ళంకర్మనే. ఏయుద్యోగమైనాచేసినిన్ను పోషించగలదు. రా! చూడు! ఆపిల్లను చూపిస్తానని

నన్ను మేడమీదికి దీసుకొనిపోయేగి పక్కనేయున్న యిం
ట్లో ఆరుబయలు పీఢేలు వాయించుచుకూర్చొన్నపిల్లను
కిటికీకుండా చూపించింది నేను సరకాయించినాను.

అనుకొన్నట్లు రెండరోజులలో పెళ్లికుదిరి కోవిలలో వి
వాహమయిపోయినది చెప్పమరచినాను మాఆవిడ పేరు నాంచా
రమ్మ నాంచారీ అని పిలుచుచున్నాను. ఈ పెళ్ళికి మావారెవరూ
రాలేదు. నేననొక కుటుంబీకుడయిన తరువాత మాకా గొడవ
యెందుకు నెలదాటకుండా మాకు పునస్సంధానముకూడ నైనది
కాని గ్రిహచారము మాఆవిడకు తెనుగు చాల మాటలకు
రాదు నాకు అరవమసలేరాదు ఇంకమూగవాండ్ల వలెనే సంచ
రించుచున్నాము. ఇంతవరకు మాకుగొప్పచిక్కు తటస్థించలేదు
కానినేను వేరింటి కాపురముపెట్టి చెన్నపురిలోనే యొకచో
చిన్ననౌఖరీ సంపాదించి యొకయింట్లో అరవపెండ్లాముతో కా
పుర మారంభింగినాను. బియ్యేపరీక్షనుండి డింకీకొట్టినదని చెప్ప
నక్కరలేదు సర్వనాశాయశోభనమ్మని కాదామరి? మాఆవిడ
సాంబారు, కూటుపప్పు చారు తయారుచేస్తుంది నాకియూడూ
అంటేడోకు యెర్రిమిర్చి పట్టుకొని వస్తానంటె సన్నఖారియం
తెమ్మంటుంది పెసరపప్పంటే కందిపప్పంటుంది పెరుగుకొంటే
మెంతిపెరుగుకింద పోచేస్తుంది అదేమిఖర్మమోకాని అలవాటు
చొప్పున ముందేయింత మజ్జిగపోసి నెచి యందులోనే సాంబారు

దిమ్మరించి యారాసియంతా కూరముక్కలతో జుర్రిమంటుం
ది, మన తెనుగునంట దానికెట్లా చెప్పను? ఏమయినా అంటె
స్కూలులో నాసబ్జక్టు అదికాదు నేను హిస్టరీ జాగ్రఫీ యెరుగు
దునుగాని యీపాకశాస్త్రము చదువకోలేదంటుంది నిజంచెప్ప
వలదా? నామీద దానికి యెక్కిలి అనురాగము భక్తి లేకపో
లేదు! నాయిష్టమువచ్చినట్లు వండవలెననియే దానికోరిక కాని
పాపము యేమిచేయగలదు! దానికి తెలియదు నాకు తినేటప్పుడు
రుచులెంచుటయేకాని వంటతప్పులు తెలియదు ఇదియొకగొప్ప
తంటాగావున్నది. ఆఖర్కు మా అక్క ఒకవారం రోజులు మా
యింటికి వచ్చి దీనికి కొంతనేర్పి తయారుచేయగల్గినది, అయి
నా మాఆవిడ మిరియంగలువండే లక్ష్మీప్రదముకాదని నమ్ము
చు వంట యంతా వల్లకాడొనర్చుచునే యున్నది. మరొక్క
తంటా నాకు వేపటం యిష్టం, దానికి పప్పుకూరలిష్టం, భోజన
మిట్లాతగవులలోనే పడియుండ మాయావిడకు గాలిపికారు
సరదా! నాకు గుడిపాటు వాటమిష్టము ఆమెకు నగలగూర్చి
యు సొగసుల గురించియు నాతోకొంత అభిప్రాయభేదముకలి
గి నది. ఆవిడని పూర్తిగా తెలుగుస్త్రీని చేద్దామని తంటాలు
పడినాను గాని ఆఖరుకీ చెన్నపురివాసము నన్నే అయ్యరుని చే
సివైచినది. వేషములో నేను దొరలాగునేయున్నాను. కలకాల
ము మాయావిడ పోరుమూలాన్ని నాయాస మాటనవ్వడితిం

డి, తీరు. మారిపోయినవి ఆఖరుకీ నాటికి మాసంతానము పూర్తిగా అరవవారయిపోయినారు వాళ్ళందరూ తల్లిపోలిక, తల్లిమాట, తల్లితీరు. దాల్చి నా తెలంగీయ మణగద్రొక్కినారు. నేనుమాత్రమిప్పటికి మనస్సులో తెనుగు వాడనే! మాఅప్పలిప్పుడు నన్నాసవాలు పట్టజాలరుకాని ఇలకొన్న దేశముపట్టిన మాకుటుంబము నేడొక్కసారి కలసికొన్నచో కలగూరగంప లాగ మరాటీ, బెంగాలీ· తమిళం, తెలంగీలు కలిసిపోయి ఒకరి మాట యొకరికి తెలియక మూగవాళ్ళవలె మాపిల్లలొండొరుల సంజ్ఞయొనర్చుకొనుచుంటే ముసలివాళ్ళము మేమంతా నవ్వుకొనవలసి వస్తుంది. దూరభారమగుటచే అయోగమింకాపట్టలేదు. పట్టవలెనని కోరిక నాకొక్కనికి బాధించుచున్నది.





# మహాలక్ష్మి

(సుధానిధి)

నా పేరెంతో ముద్దుగా గంపెడాసతో మావాళ్ళు మహాలక్ష్మియని పెట్టినారు, మా నాయనమ్మకు పక్షవాతం వచ్చి యిక చచ్చిపోతుందేమోయని నా కారవయేటనే పెండ్లి ముచ్చటగా చేసుకొన్నారు. అప్పుడేమీ నాకు తెలియద్దుకాని యిప్పుడు యాదకు తెచ్చుకుంటే గుండె గుభేలుమంటుంది. ఆయన కాపెళ్ళికి తొమ్మిదవయేడు! వీధిబళ్లో శాఖాలు చదువుచుండేవారు. నిజము చెప్పవద్దూ? పల్లకీలో మేముయ్యుభయులము మొదటిరోజున గిల్లుకొని రక్కుకొని కొట్టుకొన్నామనే కారణమున నన్ను మాఅమ్మ యెత్తుకొని పల్లకీపక్కనే నడవగా యూరేగింపు లాంఛనము జరిగించేవారు. పెళ్ళియైనది! మరియైదేండ్లకు నేను యుక్తవయస్కురాలైనాను మాఆయనకు 14 వ వత్సరము వెళ్ళినది? చురుకుగా నే చదువుకొని నాల్గవ క్లాసులో

నికి వచ్చినారు కానిండంకా చిన్నవారేకదా యని మానాం
ఢున్నిన్ను మాయింటనే యుంచినారు పనిపాటలన్నీ నేర్చుకొ
న్నాను నివ గాగరికత కుటుంబము కాకపోవుటచేత నాకు చ
దువేవీ అబ్బలేదు, కాని చాకిపద్దుతో "తెల్లచ్చుపచలు" పకి
నీలని యేమిటో కొంచెము వ్రాతమొత్తుకు వచ్చినది.

౨

నాకు 15 న వత్సరము వచ్చినది మాఆయన కొంచెము
నాగటికట్టిరు ఇప్పుడు-కనుక చెప్పుచున్నానుగాని ఆరోజులలో
మగవానిపేరు చెప్పేసరికి సిగ్గుపడి చచ్చేదాన్ని! ఆముడదూర
ము పారిపోవటమే ఆపేరు వినేసరికి! ఇక ఆగకూడదని మాఅ
మ్మపోరుమీద మానాన్న మామామగారితో బోలెడు రంధా
గొండీలుపడి యాఖర్కి సుముహూర్తము కుదిర్చి నాఆయన
తో కలిపినారు. మీరంతా నాసోదరులు గనుక నిజము చెప్పు
చున్నాను నేనే అన్నివిధాల మాఅయన్ని దిద్దుకొని దైవముచేసి
న దానికి వ్యతిరేకించగూడదని మెల్లగ సంసారము నిలబెట్టు
కున్నాను తల్లిదగ్గర గారాభము చేసినట్లే మాఆయన ప్రతిదా
నికి ఆ! ఊ! అని గారాముగా మాట్లాడినన్నన్ని విషయముల
వేధించుకొని తినేవారు మొత్తముమీద మాదాంపత్యానికి లో
టేమిలేదుకాని ముమ్మైలను జూగిన వారంతా లోలోన వారి
లోవారు ముసలిపెండ్లాము పడుచు మగడూ అంటుండేవారు

న్నా సరియే యెవరి ప్రారబ్ధమున కెవ్వరు కర్తలని సర్దుకొనినే
నేను అత్తవారింట మాయీాయనకు భూవసతి యెక్కువున్న
ది. కనుక నౌఖర్లు వగైరాలకు పంపకుండా పల్లెటూరి గ్రామమైనా
నా ఆరామవరములోనే నేనుండి తోటాదొడ్డి చూచుకొనుచు
గాలక్షేప మొనర్చినాము మాఆయనగూడా నాకెప్పుడూ పల్లె
త్తూ యెదురాడలేదు. ఈవేళ పొలములోనికి వెళ్లమంటే వెళ్ళే
వారు. వద్దంటే మానేవారు. పక్కగ్రామం తీర్థానికి చూచి
వస్తానని రెండురోజులుండనగానే వెడతానే! అని మారాము
చేసేవారు! నేనూచూచి చూడనట్లు ఒకమాటువద్దన్నా ఆఖరు
కు ఒకపావలాడబ్బులు చేతిలో బెట్టి పంపి జాగ్రత? అల్లరి చిల్ల
రి ముండాకొడుకులు హంగామ చేస్తారనివచ్చ చెప్పివంపేదాన్ని

నాకు మాఆయనమీద అనగూడదుకాని పుత్రప్రేమ
లాగుండేది ఒక్కనిముషమింటికి రావడమాలస్యమైతే విలవిల
లాడేది నామనస్సు మాఆయనకు నేనంటే నిజముగా మహా
చెడ్డభయము భక్తీకూడా వుండేది ఈలాగుననే నేనాగ్గురను గ
న్నాను. దక్కినవారు కాని రత్నములు మాణిక్యములు బి
డ్డలు దుక్కల్లాగుండేవారు ఆఖరుకిదిగో ఈమొగతప్పఆడతప్ప
యిద్దర్నీ ఈనాటికి భగవంతుడు మిగిల్చినాడు ఇంతవరకు కష్ట
సుఖములు పంచుకొని యిన్నాళ్ళూ అనుభవించాము. నాకు
ముప్పదియేండ్లు వచ్చినవి మాఆయనకు ముప్పదినూ దేవయూ

న్ను ఆడదాన్నిగనుక అర్గురనుగన్నాను కనుక నేనునిజముగా ము
సలిదాన్నైనాను వెంట్రుకలు నరసినాయి! మా ఆయన కాస్త
పిండసత్తైన మనిషియేమో! కొత్తగర్భాదానపు పెండ్లి కొడుకు
లాగున్నారు. ఇంతకు ఆయనకు బాధకలుగకుండా ఎప్పటికప్పు
డు లేని యవ్వనము తెచ్చుకొన ఊరమ్మ లక్కలకంటె పోకు
లన్ని చేసుకొనుచు ఆయనమనస్సురంజించుకొంటూనే యు
న్నాను.

4

ఇంతకీ యెక్కడదాపరించిదోకాని మాయింటి పక్క
యింటివారి సూరి ముసలిమగణ్ణి మూడునాళ్ళకే మింగివేసి
మూటముల్లె తర్లించుకొని పుట్టింటికి చక్కవచ్చింది, దాని
పొంకము పొయ్యిలో బెట్టను! రాజమండ్రీ కాపరం వెలిగించి
గోరెంకలాగ మాఅందరికంటె టక్కులమారియై ఎప్పుడు వా
రిమేడమీద కూర్చుని మా ఆయనకగపడేలాగ హార్మోనియం,
ఫిడేలు, నవలలు, భావగీతాలు పాడుతుండేది. అంతటితో నా
కొంపమునిగింది ఇంతభయభక్తులతో నావిషయమై నడచుకొ
ని వచ్చిన మాఆయన యెట్లుపడ్డాడో దానివలలో పడ్డాడు! ఒ
కరాత్రి యిద్దరూలేచిపోయి రాజమండ్రీ బ్రహ్మమందిరములో
పెండ్లియాడ ఆయూరునుండియే నాకు రిజష్టరీ నోటీసు వ్రాసి
నారు. పిల్లలను బెట్టుకొని నేను సగంవాటాభూమి అనుభవిస్తూ
వుండవలసిందని మిగతావాటాతో తాను తన వెదవ పెండ్లాము

సుఖపడతామని మా ఆయన వ్రాసినారు. నాగుండె చెరువైన
ది. నెత్తినోరు మొత్తుకొన్నాను. ఆయనవంకవారు నావంకవా
రు చుట్టాలువచ్చి నన్నోదార్చినారు. అనుకొంటే అఘాయిత్య
మే మోకాని ఆరోజున నిజముగా నాకు వైధవ్యమే వచ్చినట్లు
యేడ్చినాను. చూచినారా చిన్నప్పటినుంచి నెమ్మదిగా పెంచు
కొని పెద్దవాన్ని చేసికొని ఆర్గురు సంతానముకని యీవిధముగా
గాపురము యీడ్చుకొని వచ్చుచున్న నన్నింత దగాచేసి యీ
మాయలమారి వలలోబడి తనదకు కులభ్రష్టుకూడా అయిపో
యినారని నేనెంతో యేడ్చాను,

5

ఆఖరుకేంజేయను? నేనే స్వయముగా రాజమండ్రీ వ
చ్చి మాఆయన్ని కలుసుకొని బ్రతిమాలి నాకు వారావద్దని
కాళ్ళమీద బడి యినాళ్ళు పెంచిన పాపాన్ని నేను కులభ్రష్టనై
ఆయనతోడిదేలోకమని వారియుభయులకు వండిపెట్టుచు
వారిసుఖముచూచి యేడ్చినప్పుడేడ్చి పోనీ పడుచుతనములో
నున్న వారినే సుఖపడనీయక సమాదానపరచుకొన్నప్పుడు వ
రచుకొని కాలక్షేపము చేయుచున్నాను. నన్నంతాచూచి
యిప్పటికి యేమిటో నీవే మహాలక్ష్మివంటారు నేను మాత్రి
కు ఈడుగాన్ని పిల్లడ్ని పెంట్లాడి అఖర్కు సవతికి చాకిరీచేయు
చున్నాను కదాయని బాధమాత్రము పడుచున్నాను మీరేచె
ప్పండి నాబ్రతుకేలాంటిదో!!



# స్వయంపాకము.

(గా హూ.)

ప్రపంచకమంతా ఒక్కసారి యీ మూలనుంచి యీ మూలకు పరికించినట్లయితే ప్రాణికోటి యంతలోనూ స్త్రీపురుష విభేదము. అందుకు సంబంధించిన మంచిచెడ్డలు కనబడుచున్నవి- అందులోను మానవకోటిలో భార్యాభర్తృన్యాయ మొకటి దాపరించి యనేక చిత్రపరిస్థితులు కల్పించుచున్నది- పెద్దలు పెళ్ళిచేస్తే వధూవరులకన్యోన్యము కుదరదట! వారిలో వారు చేసుకోబోతే మచ్చుచూపులతోనే యవ్వనం జరిగి పోతూందట! అమరణాంతము ఒక్కరితో కలిసి యుండాలనే నిర్బంధము చాలచోట్ల బాధించుచున్నదట! ఎప్పటికప్పుడు మార్చుకోవచ్చునంటే పుట్టేపిల్లలు దిక్కుమాలినవారగుచున్నారట! అసలు పెండ్లియే వలదంటే స్త్రీలక్షణములే భూమిపయి నశించి పోవుచున్నవట! ఎవరియిష్టము వారిదంటే సంసార చక్రము

తిరుగడం మానేస్తుందట! ఈగుంటచిక్కులు లక్షోపలక్షలుగా హిందూదేశములో ఇప్పుడిప్పుడే వస్తూన్నాయి! కాని నాపెళ్ళి యిందులో పడలేదు- మాతల్లిదండ్రులు మాయిద్దరి అనుమతి మీాదనే సకాలములో పెళ్ళిచేశారు- మాఫొటోగ్రాఫులు ఒకర్నొకరుచూచుకొన్నాము- పెళ్ళినాటికి మాఆవిడకు 12 యేండ్లు నాకు 18 సంవత్సరములు; మామట్టుకు మాదాంపత్యము నచ్చింది- నేమంగీకరించిన మీాదటనే మాపెద్దలు పెండ్లి చేశారు- సంవత్సరము తిరుగకుండా మేముభయులము కలుసుకొన్నాము- కలుసుకొన్నదగ్గరనుంచి నేనొక తమాషాచేశాను మాఆవిడ చెప్పినట్లు నేను వినేవాడను- దానితో మాకు తగాయిదా రాలేదు- అప్పుడప్పుడు మాఆవిడకూడ నేచెప్పినట్లే వింటూాండేది- ఎటువచ్చిన యీామెపుట్టింటివిషయములో మాత్రము నేనే యీామెచెప్పినట్లు నడువవలసివచ్చేది! అన్యోన్యానురాగము నాకున్నదన్నమాటయే! ఎప్పుడూ ఏవిషయములోనూ తంటాలుపడలేదు- సంసారముచేసికొనుచున్నాము- బిడ్డలను కని పెంచుకొనుచున్నాము- కష్టసుఖములు వంచి కుడుచుచున్నాము- లోకంలో ఆడవాళ్ళకవసరమయిన చదువుమాఆవిడకు వచ్చును, నాకూ మొగవాళ్ళకు కావలసిన నౌఖరీ చదువుసంప్రాప్తమై యున్నది- నేను ఊరివారినికొట్టి పట్టుకొని వచ్చినది ఖర్చుపెట్టి మాఆవిడ సంసారము నడిపించేది- ఇలా

వెళ్ళుచున్నది-

2

నౌఖరీ మూలాన్ని కొందర బంధువుల విడచుకొన్నాను.- ఇంతకు ఏబంధువుని వదులుకోవచ్చినా నేను ఆవిడ, సంప్రతించుకొనియే తదంగము నడపేవాళ్ళము.- ఎట్లా గునవదలుట కవకాశము లేని మాఅమ్మయొక్క తెఘగిలినది.- మాఆవిడకు మాఅమ్మఅంటే అభిమానమే! ఏమందురా మాఆవిడకు బద్ధకమెక్కువ మాఅమ్మ మంచిపనిమంతురాలు కనక ఈవిషయములో విడుదల అవసరము కల్గినదికాదు కాని మాఅమ్మయే చాలప్రయత్నించి కోడలితో సంప్రతించి రామేశ్వరము చక్కవెళ్ళినది.- యీమెయాత్రవెళ్ళేవరకు పోరుపెట్టిన మాఆవిడ రెండురోజులే నాకువండిపెట్టి యేమనుకొన్నదో కాని తక్షణం పుట్టింటికి పోతానని మారాంపెట్టినది. పుట్టింటివిషయములో దానిమాటయే నెగ్గుట యాచారమగుటచే వెంటనే కిక్కురుమనకుండా పంపివైచినాను.- మరునాడుదయమే వంటింట్లో ప్రవేశించినాను- గూళ్లన్ని చక్కపెట్టినాను.- బుట్టలన్ని తడిమినాను- చెంబుముంతలు సరిచూచినాను.- నాయభిప్రాయము మొదలు ఆడవాళ్ళుచేయువంటగూడ నేనేలచేయలేననియే! హరిః ఓమ్ అని స్నానముచేసినాను పట్టుబట్ట కట్టినాను పొయిదగ్గరకు వచ్చినాను పుల్లలు పేర్చినాను- పాతగుడ్డలతో

కిరసనాయిలునింపి పొయ్యిలో కుక్కినాను- అగ్గిపుల్ల వెలిగించి
అంటించినాను భగ్గుమన్నది- అంటుకొన్నదని సంతసించి బి
య్యము గిన్నెలో పోసి కడిగి తెచ్చుటకు నూతికడ కేగినాను.
మళ్ళీవచ్చిచూచుసరికి పొయ్యి యప్పటియట్లనే యున్నది- మ
ళ్ళీకిరసనాయిలు ప్రయోగము చేసినాను- కాని ఈమాటు మం
టరాగానే విసరుట న్యాయమని విసనకర్రతో విసరినాను.
మంటపోయి పొగ నాముక్కులో దూరినది. మళ్ళీకిరసనాయి
లు ప్రయోగించి మంట తెప్పించినాను. తలుపు వేయవలెనని
యెరుగను గాలిచేత వచ్చిన బాధయని తిట్టుకొని మళ్ళీతంటాలు
ప్రారంభించినాను. ఆఖర్కు పొయ్యి మండుచున్నది,

౩

అత్తెసరు పెట్టి కూర్చున్నాను. ఏమివండుకొందునని త
ర్కించినాను. నిన్నకొన్న తోటకూర కనబడినది. నాకు తో
టకూర పులుసు బాగా యిష్టము కాని యెట్లువండుటయో తెలి
సినదికాదు ఇరుగుపొరుగువారి నడుగుట అభిజాత్యముగా తోచి
నది. ఈఆడవాళ్లు తమవంట రహస్యములు మొగవాళ్లకు
తెలియకుండా దాచినారనే విషయముమీద ఆల్ యిండియా
యాజిటేషన్ చేయవలసియున్నదని నిశ్చయించినాను నేచదివి
న కెమిస్ట్రీ ఫిజిక్సు యీపాకశాస్త్రపుసమస్య తీర్చలేదాయని
యొక్కసారి చదివిన దంతా యావకుదెచ్చుకొన్నాను. నాకె

క్కడ దీన్ని విడగొట్టు సూత్రము కనబడలేదు. ఈయోచనా పరంపరతో పొయ్యిమీదనున్న అన్నపుగిన్నె గుడగుడమన్నది. నాఅవసరము వచ్చినదని దిరిగి సిబ్బితీసుకోబోయినాను. చేయిచురుక్కుమన్నది. హీటు చేయగాల్చునని థియరీలో చదివినా ప్రాక్టికలుగా చూడకపోవడంవల్ల వచ్చిన లోపమని సర్దుకొని కాగితంముక్కలు చుట్టిపట్టుకొని అప్పటికే అడుగుమాడి అత్తెసరైపోయిన గిన్నె క్రిందికిదించినాను. పులుసు ప్రాబ్లెము తెమలలేదు. అఖరుకు వరిజనల్‌గా యోచించి చూద్దామని తోటకూర అంతట కత్తిపీటను చిన్నచిన్న చిదుపచిదుపలక్రింద తరిగినాను. బూర్లెమూకుడుపొయ్యిమీద పెట్టినాను. నూనే వేసినాను. మిరపకాయలు తుంపిపోసినాను ఆవాలు మెంతులు పడవేసినాను. ఒకఆవగింజ పెటేలుమని నాబుగ్గకైకి వచ్చి గుద్దుకొన్నది. ఏమిటని బూర్లెమూకుడుకేసి చూచుసరికి మరికొన్ని చిటపట లెక్కువయ్యె నన్ను భయపెట్టుచున్నవి. ఈమాత్రిపుదానికే భయపడేవాడిని రేపు యుద్ధంవస్తే అసంగరరంగ మహాతుంగ ధ్వనితరంగములకెట్లు నిలువగలననుకొన్నాను ఆడవాళ్ళిట్టి చిటపటలోర్చుతారు గనుకనే యెంతటి సాహసాబ్బకైన వెనుదీయుటలేదనుకొన్నాను. ఇంతలో పోపుమాడిపోవుట కన్నులబడినది. చప్పునతోటకూర అందులోకుక్కినాను చుంయ్యిమన్నది. ముందు పట్టకపోయినా గరిటతో యిటూఅ

టూ అదమాయించేసరికిలోంగి చిక్కి సగమైపోయినది బాగా
కదిపినాను మద్దయినది. జాగ్రత్తగ మూకుడు క్రిందికి దిం
పినాను రాతిచిప్పలో చింతపండు నీళ్ళలో వేసి పిసికిపిసికి రొయి
కశాట్యూరేటడుసాల్యూషను చేసినాను- పిప్పిపారేసినాను. అం
దులో యీతోటకూరముద్ద పోపుతోపహాపడవైచినాన- పొయ్యి
యెక్కించినాను. కొంచెము నవుచేర్చినాను. రుచిపచి లేని
యీపను పెందుకని వితర్కించుకొనియు పుణ్యస్త్రీ పసుపువలె
పచ్చగావుండడానికి కాబోలునని అనుమానించినాను పొయ్యి
తోపోరాటము ప్రతినిమిషము జరుగుచునే యున్నది- ఇందు
కొరకే ఈబాధ పడలేకయే మాఆవిడ పుట్టింటికి దయచేసిన
దని జాలిపడ్డాను- ఈనాబాధచూచి మాఆవిడ జాలిపడి విలవిల
యేడ్చునని తోచినాకూ కన్నీళ్ళువచ్చినాయి! పులుసు ఉడికింది
గుబగుబలాడుతూ ది! పొల్లిపోతూంది! ఏంచెయ్యను? ఉప్పు
ఉజ్జాయింపుగావేశాను మీతోనిజముచెప్పవద్దు? రుచియెట్లుం
దోయని కొంచెము గరిటితో తీసి చల్లార్చి నాల్కపయివైచు
కొన్నాను- మందుచుక్కమన్నదికాని తరువాత దానిమజా తె
లిసినది. షడ్రసములు కలిసినగాని పులుసు కాదన్నాను- ఉప్పు
పులుసు చేదు పసుపుది మెంతులదికదా ఉండనేయున్నది. కా
రం మెరపకాయిదే. తీపి తోటకూరలోనున్నదని భావింపవచ్చు
ను. కమ్మతనం యెలాగయని ఆలోచించినాను- గూట్లో దృ

ష్టిబొరించాను- ఒకసీసాలో కందిగుండయున్నది- తీసన్నాను-
గుప్పెడుతీసి యీపులుసులో వైచినాను- అంతా కలగలిపి
నాను- తయారయినదని పులుసువాటంవచ్చింది. దింపలేక
పొయ్యిలోని కొరకంచ్చులు లాగేశాను- కళ్ళు చేతులు నీళ్ళు
గారుతున్న ముక్కు కళ్ళుకడుగుకొన్నాను- కంచం పెట్టా
ను- అన్నం వడ్డించుకొన్నాను. చిత్రము! నాల్గుదిక్కుల నాల్గు
రకములుగా నున్నది- ఒకచోట బాగాచిమిడినది. ఒకచోట
అచ్చాగా బియ్యమున్నవి. మిగత రెండువైపుల రెండురకము
లగా నున్నది. అన్ని కలగలిపినాను. పులుసుపోసినాను- వేపి
చల్లార్చి పిసరివిస్తరి కలుపుకొన్నాను. గిద్దెడునూనె వేసికొన్నా
ను. హాయి! హాయి! ఏమిరుచిరా అనుకొన్నాను- ఎప్పుడు
నాజన్మమెత్తి యిట్టిపులుసు చూడలేదని నిశ్చయపరచినాను-
ఇంతటినుండి వంటవిషయములో మగవాళ్ళు ఆడంగుల మీదా
ధారపడ నక్కరలేదనుకొన్నాను- భోజనమయిన తరువాత
యీజీచై లోపడి ప్రైమరీ క్లాసులోనే మగవాళ్ళకు పాక
శాస్త్ర పరీక్షకంపల్సరీ చేయకపోతే ఆడంగులుకూడా ఉద్యో
గములు మరిగిన యీరోజులలో మగవాళ్ళకొంపలు సరికావ
నియు స్వరాజ్యమునకు ముందు ఈవిషయముపై ఆందోళన
మొదల్పి మొగవాళ్ళకీవంటహక్కు సంపాదించి తీరవలెనని
తోచింది- ఇంతటిలో మాఆవిడనాకు నిష్కర్షగా హోటలు
లో తినవలసినదని ఆర్డరు పంపినది- నేనింక మళ్ళీవండుకొనను.

— —



# మాణిక్యము.



(సుధానిధి)

మాణిక్యం చిన్నప్పటినుండి చాలా చురుకయినపిల్ల యని పేరుపడ్డది- ఈతండ్రి వెంకటరావుగారు పొగాకువర్తకం చేసి లక్షరూపాయిలు గడించి యీమెకు మిక్కిలిగా గారాబముగా పెంచినారు. తల్లిమీనాక్షి కొంచెము ఛాదస్తపుమనిషి యగుటచే అస్తమానం మాణిక్యమును అదిముట్టుకున్నావు ఇదిముట్టుకున్నావని చిటకమటక బాధుచుండుటచేత మాణిక్యము తల్లికంటె తండ్రిదగ్గరే యెక్కువచేరికగా పెరిగినది. ఎప్పుడూ ఇరుగుపొరుగువారి పిల్లలతో ఆడుకొనుటకితరులయిండ్లకే పోవుచుండేది. బాలికాపాఠశాలలో చదవడంకూడ నిజముగా తల్లి యింటివద్దర సాధిస్తుందనే మాణిక్యము సరదాగా వెళ్ళుచుండేది పెండ్లియీడు వచ్చిందని పెళ్ళిళ్ళసుగుడి బేరగాండ్రిప్పుడప్పుడు తొందరకంట మాణిక్యమునకు 9 యేండ్లువచ్చేటప్ప

టికే చూట్టం మొదలుపెట్టారు. వెంకట్రావు స్వతహాగా సం
స్కరణాభిలాషియయి పిల్లకు 11 యేండ్లయినా వస్తేకాని పెం
డ్లిచేయకూడదన్నా భాగ్యపోరు పడలేక పెళ్ళిసంబంధాలు మం
చివికావని సంబంధములు దొరకక కొన్నాళ్ళు కొట్టుకులాడిన
నాలుగువేలు కట్నమిస్తానన్నప్పటికి దొరకక తుదకు పట్నం
లో చదువుతూన్న సుదర్శనరావను పిల్లవాడు తల్లిదండ్రులు
లేనివాడు- ఆస్తికూడా అవిధముగానే నాస్తియయినవాడు
ఫ్రీస్కూల్ మీద యింతవరకు చదువుకొనుచున్నవాడు చటు
క్కన సందర్శించినాడు! యథావిధిగా వెంకట్రావు మాణిక్యం
పెళ్లి జరిగించినాడు.

2

సుదర్శనం అందమైనవాడే! సుగుణవంతుడే! మాణిక్య
మునకు దగినవాడే! భగవంతుడూ ఓర్చవలదా? చెన్నపురిలో
దగిలిన మన్నెపుజ్వరమునకు అశ్రద్ధజేయుటచే ఆఖరుకు పెండ్లి
యయిన 3 వ మాసములోనే పరమపదించినట్లు వెంకట్రావున
కు టెలిగ్రాము వచ్చినది. ఇంక అలగోలబాలగోలగా దుఃఖస
ముద్రము వెంకట్రావుగారి యింట ముంచుకొన్నది- మాణి
క్యంకూడ తల్లిదండ్రుల యేడ్పువిని యేమోయని కొంతయేడ్చి
వది- 9 యేండ్లు గడచిన పిల్లకాయాపత్తేమి తెలుస్తుంది- ఇరు
గుపొరుగువారు చాలా పిల్లనుజూచినప్పుడల్లా జాలిపడుతున్నా

రు! తల్లియేస్పుతోటే పిల్లను శిరఃకర్తనము తనవాయిగా ముండమోపిని చేసినది. బరిమూన్పించినది. తలమువ్వులకప్పించినది- మాణిక్యంను మెల్లగా వంటలో మప్పుచున్నది- కంటదడితోటే కన్నతల్లి మాణిక్యమును వైధవ్య మనుభవింప జేయుచున్నది- వెంకటాద్రిపుమాత్రము భరింపరాని దుఃఖమొందుచున్నాడు. తనమనస్సు అటు సంస్కరణమునకు యిటు చాదస్తమునకు యని వేసార్లుయ్యాలలూగించినాడు భార్య భయమునొందగుటచే లోకముయొక్క దెష్యపుకన్ను భయంకరమగుటచే వెరగి వెన్నిచ్చి యీవిషయములో భార్యకు స్వాతంత్రిమిచ్చి తానూరకొన్నాడు.

3

మాణిక్యం తల్లిప్రీతిచే వంట రెండుపూటలా చేయుట కలవాటు పడినది. వ్యక్షురాలయిననాడు మరలనేడ్పులు కడబొబ్బలు వారియింట జరిగినవి- ఇప్పటికి తనగతి యొక నయిశత్యము దౌర్భాగ్యము తెలియవచ్చినది- లోలోనదావానలము చెలరేగినది. తనయీడువారలేయను మాటలేల? తన తల్లిదండ్రులే రాత్రిపూటల పడకగదులంజేరి తన్నవతలి వసారాలో బండుకొనబెట్టుటాలోచనకు బారి మాణిక్యం హృదయాంతరాళమున జగత్తునకయి హిందూమతములోని యీదురాచారపు మత్తునకయి తహతహపడుచున్నది. కాని యేసు

చేయగలదు? ఇంతకు బేలయగు నబలహా ప్రపంచకము నెత్తి సమంతిసవ్వను గాగలదు? తనగతి కేమ్పుట వాక్క టె చేతనయినది. మనః పద్మము ముకుళించి తిరిగి మళ్ళీ గాఢాంధకారమున నరసిపోయినట్లు తలచుకొన్నది. ఇంక విధిలేక రాత్రులు గాలక్షేపమునకును తండ్రిగారి గ్రంథభాండాగారమున గల తెనుగు నవలలు నాటకములు చదువుకొనుచున్నది. చదివినకొలది తనహృదయము కొంచెము వికసించినట్లు కొంత మరిమళించినట్లు యొకకొంత మరల ముడిచికొనినట్లు గ్రహింపదల్గినది. ఆంధ్రపత్రిక చదువుటకూడా నారితేసినది. ప్రపంచవార్తలు తెలియుచున్నవి. రాజమండ్రీలో వీరేశలింగముగారి వితంతు శరణాలయము. శ్రీపంతులుగ రినర్థంతి పత్రికలో జదివినది. ఆశాలతచిగిర్చినది. బుసబుసి పారికినది. అలముకొన్నది. ఆవేశము గల్పించినది. బుద్ధినిశ్చయపరచుకొనలేక తొట్రుపడినది. తండ్రితో గూడ చెప్పకూడదాయని సందేహించినది. ఆఖరుకొకరాత్రి తగిన ద్రవ్యసహాయముతో బయలుదేరి రయిలెక్కి వెళ్ళిపోయినది.

4

వితంతు శరణాలయములో మాణిక్యము చదువుకొనుచున్నది. తన్నిర్వాహకులు పెండ్లింప ప్రయత్నములు చేయుచున్నారు. కాని వరుడేడీ? పంతులు పరమపదించిన తరువాత వ

రు లంతగా మందుకు వచ్చుటలేదు. అయినను మాణిక్యమే త గుళ్ళుద్ధతీసికొని సలాన్వేషణ మారంభించినది. ఎట్లు? గోజా గోదావరిగట్లుపయి షికారు మొదటి కృత్యము. తెనుగుపత్రిక లన్నిటిలోను భావగీతములువ్రాసి హృదయస్థంబగునుద్దేశము లోకమునకు వెలిబుచ్చుట రెండవసాధనము. సాంఘికోపన్యాస వేదికలపయి గొంతెత్తి వక్తృతా గరిమ ప్రకటించుట మూడవది. ఈమూటియందు మాణిక్యం మంచిదిట్టముగా పది! మాణిక్యం భావగీతికలు చదివిన మహావ్యాప్తి జెంది ప్రతివాని నోట నలగారుచున్నవి గాలిషికారులోననేకుల వచ్చి యీమె తో స్నేహముకై ప్రయత్నించిరి. ఆమెమాత్ర మొక్కింత లోనే చనవియ్యక వారివారి మనఃప్రవృత్తుల కనుగుణ్యము గా ప్రసంగించి వెళ్ళిపోవుచున్నది- కాని రామారావను బి య్యే విద్యార్థియొకడు నిరంజరము వెంటనంటినాడు! ఏదో ప్ర సంగము గల్పించుకొని గాలిషికారు తుదవరకు వచ్చెడువాడు! అతడు భారకవియే భారత పత్రికయొకసారి అదృష్టవశమున వీరియుభయుల గీతిక లొక్క పుటపయినే దగ్గరగా గలిపి ము ద్రించినారు రామారావునకు సందుదొరికినది ఆనాడు గాలిషి కారులో వారు విధిక ప్రదేశము ప్రాప్తించినతోడనే రామా రావు! నెచ్చెలీ! మనల నుభయుల భారతి కలుపుచున్నదని నాభిప్రాయముగనన్నాడు! మాణిక్యం సిగ్గుచేత దలవంచుకొని

"భ్రాంతి యఖండ దయాంస్వామూపురాలు!" అన్నది- రామా రావు చటుక్కున యామె మృదుమృణాళము లోని కరపల్లవము గ్రహించి ముద్దుగొనెను-మాణిక్యమును చేరజని ప్రియా భగవత్సంకల్పము నెరవేరనిమ్మన్నది- రామారావు ఇందులకు ఆరాగామణిత సూర్యభగవానుడే సాక్షి" యనుచు నర్ధాశ్లేషమొనర్చి మోవి మోవింగలిపినాడు.

రామారావు మాణిక్యముల వివాహముగూర్చి పత్రికలన్నియు వేనోళ్ళ బొగడినవి. పెళ్ళినాడే రామారావు బియ్యే ప్యాసయినట్లు తంతివచ్చినది. ఇంక నంతయు నానందమే! మాణిక్యం తండ్రి వెంకటాద్రివు అఖర్కు భార్యవద్దనేవదలి పుత్రికాప్రేమచే మాణిక్యముకడనే యున్నాడు! తల్లిమాత్రము రేయింబవళ్ళు యింటబడి భర్తను పుత్రికను బడదిట్టుచు తన స్వర్గమార్గమున కడ్డుపడుదురేమోయని దూరముగానే నోములకుట్రలనకొనుచు వచ్చిన దల్లావత్రితము:కోసం పాపపరిహారములకొరకు ఖర్చు పెట్టుచు గాలక్షేప మొనర్చుచున్నది- ఇదంతా వెంకటాద్రివు అమాయకత్వముగాకపోతే ఆమెనట్లావదలివేస్తాడా? అని ఇరుగుపొరుగువారు అనుకొన్నారు- తల్లి మాత్రము కంఠములో ప్రాణముండగా మాణిక్యమును క్షమించలేదు! ఛాదస్తపుముద్దనే బ్రహ్మ యామెగ- చేసినాడని ప్రజలు నిశ్చయించినారు.

# శ్రీకృష్ణ శరణాలయము.

(సు ధా ని ధి)

- రామారావు పంతులుగారు యెమ్మే బియ్యేల్ పాసై నారు మెట్రిక్యులేషనలో నాడు మొదటితరగతిలో సత్తీర్ణు డగుటచే నతని మామగారతని తరువాయి విద్యకంతకు తానే ఖర్చుపడుదునని సిద్ధపడి పైగా 2 వేలు కట్నమిచ్చి బంగరుబొమ్మవంటి తనకుమార్తె నిచ్చి వివాహ మునర్చెను ఇతడు బియ్యేలోనుండగానే భార్య కామాక్షమ్మ వ్యక్తురాలయినది వెంటనే భార్యాభర్తలు కలుసుకొన్నారు, చెన్నపురిలోనే కాపురము పెట్టి మిగతాచదువంతా రామారావు పూర్తిచేసినాడు కామాక్షి చాల యందగత్తె సుగుణవంతురాలు పేరిమరాశి మహాయిల్లాలు భర్తనెల్లప్పుడు దైవమువలె జూచుకొనగల్గిన పరమభక్తురాలు రామారావును మహాధీశాలి గొప్పదేశభక్తుడు భా

ర్యాము రాగతప్పుడు. ఒక్కనిమేషమును భార్యను వదలి యుం
డజాలడు. అట్లని చదువే మరచుండ సక్రమముగ కాలేజీకి వెళ్ళు
చు బరీక్షలన్నియు సక్రమముగనగడ తేర్చెను. ఇరుగుపొరుగు
వారెల్ల రాదాంపత్యముచూచి మిక్కిలి యానందపడుచున్నారు
ఇప్పుడు రామారావుపంతులుగారు ఈపట్టణమున బల్లకట్టి ప్లీడరీ
ప్రారంభించినారు. కాని, చదువుకు అదృష్టమునకు సంబంధము
లేకపోవడంచేత భగవంతుడింక రామారావునకు మామగారి
యాశ్రయము దప్పినది కాదు.

కామాక్షికియు తండ్రిగారి యగ్రహారీకపుమాన్యము
లయిపోయినవని తెలిసినకోడనే భర్తపై కొంచెము విసుగు
దలపుట్టినది. వంట దాసుస్వయముగానే చేయుచున్నదగుటచే
నప్పుడప్పుడు కొంచెము కొనుకుట విసుగుట యొత్తివడించుట
యేర్పుట ప్రారంభమైనవి. పాపము కామాక్షియుద్దేశమిందు
వలన మగడు మరికొంత శ్రద్ధతో నార్జనమొసర్చునని యూ
హా కాని మరేయితర కారణమును లేదు. రామారావును సంగతి
గ్రహించి పోని యేదైనా నవుఖరీ సంపాదింతుమాయని యో
చించెను. కాని తన బ్రాహ్మణజన్మ చాలచోట్ల నభ్యంతరపడి
యాతనికోరిక లీడేర్చినది కాదు. నానాటికి గృహకోభతగ్గుచున్న
ది. మామ వెంకటశాస్త్రి మొన్ననేవచ్చి పెద్దసోది ప్రారంభి
చి చివరకిక నెంతమాత్రము తానాదుకొనజాలనని స్పష్టము.

గజెప్పి చక్కఁబోవును కడిపెను చదువున్నది. ఏమి చేయును? అ
డవిగాసిన వెన్నెలయగుచున్నది. తుదకు గుట్టునకుబకియు డి
కామాక్షియే సాహసించి తనమెడలో పుస్తెలమ్మించియు నరి
పోషణ జరుపుచున్నది వేయిరూప్యములనగ కీ పట్టణ వాసములో
నెన్నాళ్ళాగును? కామాక్షి తనయింటప్రవేశించి యాక్రమిం
చుచున్న పెద్దమ్మను కన్నులారాగాంచి కన్నీరుగార్చుచున్నది
రామారావును నిరంతరము ధ్యానయాత్రుడై డీలుపడి జబ్బుపడి
బెంగతో మంచమెక్కెను! క్లబ్బు స్నేహితులు చూచి వెళ్ళుట
యేకాని మెరిగియుండియు నొక చిల్లుగవ్వ సహాయమునర్పిన
వారు కారు. కామాక్షి మెడలోగల యాఖరునగ నానుకూడ
నేడు బజారెక్కినది రామారావు కంటతడిపెట్టుకొని భార్యకై
జాలికరముగజూచి నిట్టూర్పు విడచెను. అక్కడికి ఖర్చులేని
ఖూనీ వైద్యమే చేయుచున్నాడు చప్పిడితిండితో చన్నీళ్లస్నానము
తో రుగ్ణత మాపుకొనజూచుచున్నాడు. భార్యయు భర్తతో
పాటు చప్పిడి ప్రారంభించి భర్తకువలసిన తొట్టిస్నానమువగై
రాలు స్వయముగా జేయించుచున్నది. ఎన్నితగ్గించినను పట్టణ
వాసపుఖర్చు చట్టుబండలై జరుగుచునేయున్నది.

ఈవిషమతరావస్థలో రామారావుమామ కలరావచ్చి
చనిపోయెనని తంతివచ్చినది, కామాక్షి యెట్లువెళ్లగలదు? క
టికి మంటికి కేకాగానేడ్చినది. ఇక్కడనుండియే తండ్రి కళ

ధారలతో దర్పణ మొనర్చినది. అక్కడ కామాక్షి సవతితల్లి
చనిపోయిన భర్తృశవముచే పిల్లువాపోయించుకొని యున్నలో
గృహలోన్కు పురింటికి నాల్గవనాడే తల్లి చనిపోయినదని ఖ
బురు తెలిసినది. ఇక్కడ రామారావురోగ మిూకవహార్తచే
మరింత బెడిదమైనది. లోకులు నోళ్ళు నొక్కుకొనుచున్నారు.
పాప మెట్లు పరిణమించునోయని కామాక్షి చెవులబడునట్లేయూ
సాడుచున్నారు. కామాక్షి కొడలు కంపరమెత్తుచున్నది. రా
మారావు స్పృహదప్పియున్నాడు. ప్రలాపించుచున్నాడు.
తొంగిచూచు దిక్కుకూడలేక యహోరాత్రములు భర్త
మంచముకడ కడవలకొలది కన్నీటితో గామాక్షి ఘోషించు
చున్నది.

ఇట్టిసమయమున నకాత్తుగా నర్ధరాత్రి వీధితలుపు తట్ట
బడినట్లయి కామాక్షి తలుపుదెఱచినది. వెంటనే యొకవ్యక్తి
వదినా క్షేమమా అనుచు లోనబ్రవేశించినాడు! కామాక్షి అ
వ్యక్తినిజూచి ఆనవాలుపట్టి "రావోయి కృష్ణమూర్తి బావా
యనిలోనికిదీసికొనియేగి సమస్తమును కన్నీటితో విశదీకరించి
నది. కృష్ణమూర్తి కామాక్షి మేనమామ కొడుకు కలకత్తాలో
నొక కర్మాగారమందు యింజనీయరుగా నున్నాడు. రామారా
వును, కామాక్షినిజూచి యాతనికన్నులు చిల్లులుపడ్డ కడవలవ
లె నీరుగార్చినవి ఒక్కతడవ వట్లనేయుండి వదినా! విచారింపకు

అని బైటికివచ్చి ఆయర్ధరాత్రియైన నొకతెలివైన డాక్టర్నురప్పించి వీధిలోనే యాతనిచేతిలో నొక నూరురూప్యములనోటు పడవైచి "జాగ్రత్త! ధనమునకు వెనుదీయను ప్రాణరక్షణ మొనర్పుమని హెచ్చరించి లోనికిబ్రవేశపెట్టెను. డాక్టరు రోగినిబరీక్షించి యింజక్షనువగైరా మహాప్రయోగము లొనర్చి తెల్లవారుసరికి రామారావునకు స్మృతి తెప్పించును కృష్ణమూర్తి ఒక్కమాటలో కామాక్షికి సర్వవిధముల హామీనొసగి యిచ్చి యనుక్షణము రోగిని కుటుంబమును తానే పరికించి కాపాడుచుండెను. కామాక్షియొక్కసారియే యశుత్రికరణములతో శ్రీమన్నారాయణ పదారవింద ధ్యానతత్పరయై నమస్కరించెను వారమునాటికి రామారావు పక్కపైగూర్చుండగల్గెను. కృష్ణమూర్తి వినయమైన కృతజ్ఞత జూపుటయెట్లో యాతనికి గోచరించి "కృష్ణా! కృష్ణాయని పిలుచుచుండెడివాడు కృష్ణమూర్తి యనుగ్రహించి" అన్నా! ధైర్యమవలంభింపుము భగవంతుడే సమస్తవిధముల రక్షకుడు నీకునాకు వీధిలోగలమనకంటె దీనతనమైన కుక్కకును తండ్రియని హెచ్చరించెను. కామాక్షి భర్త కారోగ్యము కలుగుచున్నందులకు సమయమునకు తనరక్తసంబంధకుడే యిట్లుదైవమై వచ్చినందులకు లోలోన సంతసించి భగవంతుని మాహాత్మ్యమూరయుచుండెను.

రామారావు కులాసాగా కృష్ణమూర్తితో డ్రాయింగు హాలులో పడకకుర్చీలపయి కూర్చుండియిష్టగోష్టిజరుపుచుండెను కామాక్షి సమీపముననేయుండి వారిమాటలు వినుచున్నది.

రామా—కృష్ణా! నీమేలెన్నఁడు మరువగలను.

కృష్ణ—అన్నా! నాకేమీ లేమున్నది. భగవత్కటాక్షము కాకపోయినచో నీయాశతాంశము విద్యాగంధములేని నేను నెలకు వేయిరూప్యములు కళ్ళజూచుచుండుటయేమి నీకిట్లుగచాల్గొందుటేమి! ఇంతయు భగవంతుని చేయునము.

రామా—మా పాలిటికి బావా! నీవే దైవమని నానమ్మకము.

కృష్ణ—వదినా? రక్తస్పర్శకల మన మిట్లనుకొనుట తగునా?

ఇట్లు అన్యోన్య బహూకరణములైనపి ఆరాత్రి కృష్ణుడు కలకత్తా వెళ్ళదలచుకొన్నాడు రామారావు సుఖనిద్ర పొందుచున్నాడు తెల్లవారగట్ల కావచ్చినది కృష్ణుడు ప్రయాణసన్నాహమై కామాక్షి పడకటిల్లుకడ నిల్చి వదినాయని మెల్లగబిల్చెను కామాక్షి తటాలున లేచివచ్చి కృతజ్ఞతా సూచకముగ చిరునవ్వునవ్వుచి బావా! ప్రయాణమేనా! యన్నది.

కృష్ణ—వదినా! వెళ్ళకతప్పదు కాని నీకొక మాటచెప్పి పోనెంచితిని.

కామా—ఏమిటి బావా!

కృష్ణ—నేను నీకు మేనబావనని నీ వెఱుఁగవు? నేనింతవరకు బ్రహ్మచారినని కూడ నీవు తెలిసికొనియున్నావు?

కామా—(సంశయముతో) ఔను మొదట నాతండ్రి నన్ను నీకివ్వ యత్నించుటయు మీతండ్రి యడ్డుదగులుటయు నాతరువాత నీవు కలకత్తా లేచిపోవుటయు నేటికే యిట వచ్చుటయు నేనెరుంగకేమి!

కృష్ణ—కామాక్షీ! ఆవివాహమట్లు తప్పిపోవుటయే నన్నిట్లు బ్రహ్మచారి నొనర్చినది. అయినను తుచ్ఛమైన దురాలోచనతో నిన్నిట్లు పిలువలేదు. క్షమించుము ఇప్పటికే నేను మహోత్కృష్టమైన ప్రేమతో నాహృదయాంతరాళమున నిన్ను బూజించుకొనుచున్నాను. కాని నీసంసారసుఖమున కొంతయు నడ్డు రాని కొకప్పుడైన నిట్లు సహాయుడనై నీమెప్పువడయుటయే నాపరమార్థము మెప్పువడయుటలో గూడ తుచ్ఛకామేచ్ఛ కాదు. దైవికప్రేమాతిరేకము. ఇదిగో ఈనాలుగు వందలును నీవద్దనుంచి తగురీతి నీభర్తను రక్షించుకొనుము. నీకుభర్తయే దయివము ఆతడిప్పుడిట్లు డీలుపడినను ముందుముందు గొప్పకీర్తి గాంచగలడు. మీదంపతులు చిరస్థాయులై సుఖింతురుగాక! కాని నాకీనభావ జన్మాంతరము వరకిట్లే నిన్నారాధించుకొనుచు దేహమీడ్చుదునని నమ్ముము యిందుకు నీవు

చేయునది లేదు ఇది స్వీకరించిన జాలునని యానోట్లు ఆమె చేతిని డెను. కామాక్షి యిది యంతయు నిదివరకే యూహించినను ఈతడిట్లు వెడలగొట్టునని యెరుంగదు కనుక నిర్భరాశ్చర్యముతో ఆనతశిరస్కయైకపోష్ణాశ్రుధారలతో నాతనిపాదముల దుపుచు బలవంతముగా దనచేతనుండి యనోట్లు నాల్గు స్వీకరించి "బావా! దయువఘుటన మనివార్యముసుమా. అనిమాత్రమన్నది. కృష్ణుడప్పుడే వీధిలో నున్నాడు? కామాక్షికి సెలవుసెలవనుచు నాతడు వెడలిపోయెను.

5

రామారావు స్తిమితపడి దైవవశముల దగుమాత్రపు టాదాయము నారంభింపగావదమునిదొ్రక్కొని కామాక్షితో గాపుర మొనర్చుచున్నాడు. కామాక్షియు ననుదినము శ్రీకృష్ణునివలె కృష్ణమూర్తిని దలచుకొనుచునే యున్నది. ఈమానసిక పరిణామము హైందవనీతికి భంగమేమోయని యొక్కొక్కసారి వేవగించుకొనుచునే యున్నది, కాని కృష్ణుని యూవింత సహాయము. ఆవింత బ్రహ్మచర్యము, యూవింత సంభాషణములోని ప్రతిజ్ఞ మాత్రము మఱువునకును రాలేదు.

కొన్ని సంవత్సరములకు కృష్ణమూర్తి కాశీఘట్టములో నొకసాయాహ్నమున నకస్మాత్తుగా మరణించెనని వార్త వచ్చి

కామాక్షి రామారావులు [illegible] రో
జులకు కలకత్తా సిటీ షెసన్సుకోర్టు కృష్ణమూర్తి తాలూకు
10 వేల రూపాయల విలువగల నగల యావదాస్తియు వాని
విల్లుప్రకారము కామాక్షికి పంపివేచినాడు ఇప్పుడు మాత్ర
ము కామాక్షి దుఃఖమాపుకొనజాలక గోడు గోడని బావకై
దుఃఖించి రామారావుతో తానా రాత్రి పూసగ్రుచ్చినట్లు కథ
నంతయు జెప్పివైచెను. తుదకాయిద్దరును సంప్రతించుకొని
యీపట్టణమున నాధనముతో నొకశరణాలయము కృష్ణమూర్తి
పేరుతో నాతనిద్రవ్యముతో నెలకొల్పితమ యాదాయములో
సరిగా నాల్గవవంతాశరణాలయమునకే నెలకానెల యిచ్చి
తామేస్వయముగా నడుపుచున్నారు. అదియే యీయారంగ
ల శ్రీకృష్ణవితంతు శరణాలయం.

సంపూర్ణము.



